Regd No. N. 45 / M. 3813

వెల ఒక అణా

10289

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర చైత్ర బ॥ ౬ (౧౩-౨-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౬౫

ఆఫ్రికాకు క్రొత్త బ్రిటిషు సేనలు

జపాను రష్యాల ఒడంబడిక

## బ్రిటిషుచర్యలచే జర్మనులకు ఘోరనష్టములు

### బెల్గ్రేడునగరమును జర్మనులాక్రమించిరి

బ్రిటిషు సేనలు వెనుకకుపోయి క్రొత్త స్థానాలుచేరినవి

యుగోస్లావియారంగంలో ఉత్తరభాగములో ఏప్రిలు ౧౧ వ తేదినాటికి ఒక పెద్ద జర్మను సేనదారువారీమార్గమున సేవ్ నదివద్దకుచేరెను. జాగోడీ ఆక్రమణానంతరము జర్మను సేనలు క్రొగుజెవాకుకుపోయి దానినికూడ ఆక్రమించిరి జాగూడీవా, క్రాగుజెవాల్ పట్టణములు బెల్గ్రేడుకు ఆగ్నేయదిశలో ౫౦ మైళ్లదూరంలో నుండునట్టివి ఇవిరెండును ఏప్రిలు ౧౦ వ తేదిన జర్మను సేనలుపట్టుకొనినట్టిచాప్రియా, పరాట్సిన్ అను పట్టణములకు సరిగాపడమటనుండునవి. ఈమార్గమున జర్మనులు మధ్యసర్బియాకుపోవుచు నారు.

మధ్యయుగోస్లావియాలో జర్మను సేనలు ఏప్రిలు ౧౨ వ తేదిన క్రూసెవాక్ వరకువచ్చి అక్కడినుండిముందుకునడువలేకపోయిరి,

ఏప్రిలు ౧౧ వ తేదినాటి మరొకముఖ్యవార్త ఏమనగా ఆల్బేనియాసరిహద్దువద్ద యుగోస్లావియా సేనలను కలిసికొనుటకుజర్మను సేనలుయత్నించుచుండ యుగోస్లావియా వారు ఎంతఆటంకపెట్టినను ప్రయోజనములేకుండపోయెను. తుదకుజర్మను సేనలు ఇటలీసేనలతో ఆల్బేనియా సరిహద్దులో డిబ్రా కాసరస్సువద్దకలిసికొనినవి. జర్మను సేనలట్లుకలిసికొని డ్రిన్ నదిమీదుగా ఆల్బేనియాలోకి యుగోస్లావు సేనలు రాకుండా అడ్డుపెట్టుచున్నారు.

స్కోప్లీజర్మనులవశమైనట్లు గతసంచికలో చూచియుంటిమి, నానివిధరల రాబట్టుకొనుటకై యుగోస్లావు సేనలు ౧౩ వ తేదివపోరాడినవి.

౧౩ వ తేదిన జర్మను సేనలు బెల్గ్రేడుపట్టణములో ప్రవేశించినవి: ఈనాటికి యుగోస్లావు సేనలు అగ్రస్థానాలనుండి వెనుకకుమరలి కొండలప్రదేశంలోకిచేరినవి, డాల్మేషియాసముద్ర తీరమునుండి తమకుయుద్ధసామగ్రిచేరువరకు అక్కడనేకాచుకొనియుండదలచినవి.

యుగోస్లావియావారు చాలధైర్యముతోనే పోరాడుచున్నారు, ఇందువల్లజర్మనులకు చాలనష్టముకలుగుచున్నది. స్కోప్లీవద్ద పోరాటములో ౪౦ జర్మను మరతుపాకియంత్రములు యుగోస్లావియులచే పాడుచేయబడినవి. అనేకులు జర్మను సైనికులు ఖైదుచేయబడిరి. యుగోస్లావియులకుకూడ నష్టములుచాలఎక్కువగా నున్నవి. అయినను వారు పోరుమానుటలేదు.

ఆల్బేనియాపై దాడివెడలినయుగోస్లావియా వారిసేనలు ఏడ్రియాటికుసముద్రంలో చాలముఖ్యమైన దురాజోరేవునుపట్టుకొని, నిశ్చితోత్తరమున జర్మనులవశములైనస్థానాలను తిరిగి రాబట్టుకొనుటకైపోరాడుచున్నవి.

ఇటలీనుండి యుగోస్లావియావాయువ్య ప్రాంతమువైపుపోవుచున్న ఇటాలీయుసేనలు ఏప్రిలు ౧౧ వ తేదినాటికిసేవునది, జాబ్లిజానా మొదలప్రాంతంలోనడుచుచుండెను-

### గ్రీసుపై జర్మనులయుద్ధము

జర్మనులు గ్రీసురంగంలో సాలానికాను పట్టుకొన్నట్లు గతసంచికలో చూచియుంటిమి అక్కడినుండి ౫౦ మైళ్ళపడమటనుండే యానీనా జర్మను సేనలు ఏప్రిలు ౧౧ వ తేదినాటికి చేరెను- జర్మను మోటారుసేనలు మొనాస్టిర్ లో యునుండాపోయి ౧౨ వ తేదినాటికి గ్రీసులోని ఫ్లోరినాప్రాంతంలోచేరి ఈ మొనాస్టిర్ వద్ద బ్రిటిషుసేనలు గ్రీసు సేనలును కలిసి జర్మనులకుచాల ఘోరనష్టమేకలిగించినవి-జర్మను సేనలు ఉత్తరగ్రీసులో ఏప్రిలు ౧౦ వ తేదినాడు బ్రిటిషు సామ్రాజ్య సేనలతోకలిసినవి. ఈ సామ్రాజ్య సేనలలో బ్రిటిషు సేనలును, న్యూజీలెండు సేనలును, ఆస్ట్రేలియను సేనలును ఉండెను-

మొనాస్టిర్ వద్ద జర్మనులను ముందుకుసాగనీయకుండ జరిగినపోరాటము చాల ఘోరమైనది బ్రిటను సాయుధ మోటారు,శకటముల సహాయాదశ మొకటి ఒక జర్మను కాల్బల దళమును ఏప్రిలు ౧౧ వ తేది చెదరగొట్టెను. ఇదేరోజున మొనాస్టిర్ నుండి ఫ్లోరినాకుపోవురోడ్డుపై జర్మనుటాంకుల దళము నొకదానిని గ్రీకులు చెదరగొట్టిరి. ఏప్రిలు ౧౨ వ తేదిన బ్రిటను సేనలు జర్మను సేనలతోపోరాడి వెనుకకు తిరిమివేసినవి,

ఇప్పుడు బ్రిటను సేనలు ఏడ్రియాటిక్ సముద్రంనుండి ఈజియన్ సముద్రంవరకు నిలచియున్నవి. ఈ బ్రిటను సేనలకు తోడ్పడు గ్రీకు సేనలను జర్మను సేనలు పట్టిచూచుచున్నవి. అనగా బ్రిటను సేనలబలమెంతయున్నదో కనుగొనవలెనని వాటిఉద్దేశ్యము. బ్రిటను సేనలును ౧౨ వ తేదినాటికి వెనుకకుపోయి అక్కడక్రొత్తస్థానాలను చేసుకొన్నవి. ఇంకనూ జర్మను సేనలకును బ్రిటను సేనలకును పెద్దపోరాటము ప్రారంభముకాలేదు. ౧౨ వ తేదిన మరికొన్ని బ్రిటను సేనలు గ్రీసులోకివచ్చి చేరినవి.

### విమానాల దాడులు

యుగోస్లావియాలోను, గ్రీసులోను ఉండే జర్మను సేనలమీదను, వాటిసాహసగ్రిమీదను, బల్గేరియాలో జర్మను సేనల స్థానాలమీదను బ్రిటను విమానాలు, గ్రీకువిమానాలు, యుగోస్లావియా నాలు తిరిగిబాంబులను వేయుచు నష్టముకలిగించుచున్నవి. జర్మనువిమానాలు గ్రీకుల,యుగోస్లావుల స్థలాలపై బాంబులువేయుచు నష్టములను కలిగించుచున్నవి.

మొనాస్టిర్ వద్ద ఏప్రిలు౧౨వ దిన జర్మను సేనలపై బ్రిటను సేనల బాంబులువేసి చాలానష్టాలు కలిగించినవి. బిట్లోజ్ వద్ద జర్మను సేనలపై మరతుపాకులు ప్రేల్చినవి. ఫ్లోరినాకును ప్రిలెప్ కునుమధ్య జర్మనుసాయుధమోటారు శకటముల పైనను కెనాలిస్టేషనువద్ద జర్మను సేనల పైనను ఏప్రిలు౧౦ వ తేదిన బాంబులు ఎక్కువగా వేయబడినవి. ఇదేరోజున దక్షిణయుగోస్లావియాలో కెలీస్ ప్రిలెప్ పట్టణాలలోను ఉత్తరగ్రీసులో కిల్కిసులోను జర్మనీసేనలపై బాంబులువేయబడినవి మొనాస్టిర్, సలిస్రులమధ్య ఒక జర్మను సైనికదళముపై బ్రిటనువిమానాలు ఏప్రిలు౧౨వ తేదిన బాంబులువేయగా చాలాజర్మనులుగాయపడిపోయెను. పాలీకాస్ట్రోనువద్ద ఒకవంతెనవాకమైపోయెను.

ఏప్రిలు౧౨వ తేదిన బ్రిటనువిమానాలును, యుగోస్లావియాలోను సప్పువిమానాలును బల్గేరియాపై దాడిచేసినవి. బ్రిటను, గ్రీసువిమానాలు ఈరోజు మొనాస్టిర్ ప్రాంతంలో జర్మను సేనలపై బాంబులువేసినవి.

### అమెరికాసహాయము.

రెడ్ సీ[ఎర్రసముద్రం]మీదుగా బ్రిటన్ వారికిని యుగోస్లావియాను కావలసిన యుద్ధసామగ్రిని అమెరికావారు పంపించుటకై అమెరికా

## దూరప్రాచ్య బ్రిటిష్ సర్వసేనాని

దూరప్రాచ్య సర్వసేనాధిపతి ఎయిర్ ఛీఫ్ మార్షల్ సర్ రాబర్టు బ్రూక్ పోపామ్ గారు ఏప్రిల్ ౧౦ వ తేదీ ఉదయము విమానములో సింగపూరు వెళ్లెను, నిన్న అయన డచ్చివిదేశాంగమంత్రి డా॥ వాన్ క్లెఫెన్సుగారితోను, ఫిలిప్పైన్సునందలి అమెరికా సం॥ రా॥ హైకమీషనరు ఫ్రాన్సిస్ సేయర్ గారితో దీర్ఘముగా మాట్లాడెను.

### ప్రత్యేకముగా సెలవు

హజరత దాదీ బేగంగారి మృతిసందర్భములో హైద్రాబాదు రాష్ట్రమంతయు ౧౩ ఖుర్దాదు గురువారంనాడు కచ్చేరీలకన్నింటికిని సెలవియ్యబడినది.

వారు వశపరచుకొన్న ౩౦ డేనిషు నావలను ఉపయోగించుచున్నారు.

జర్మనువిమానాలు ఏప్రిలు ౧౦ వ తేదిరాత్రి ఏథెన్సుమీదను, ౧౨ తేదిరాత్రి వోలాసుమీదను, పిరయూస్ మీదను బాంబులువేసినవి- మూడుజర్మనువిమానాలు క్రిందకూల్చబడినవి-జర్మను దాడులచేకొద్దినష్టముకలిగినది- ౧౧ వ తేదిరాత్రి పిరయూసువద్ద బాంబులువేయగా ఒకగ్రీకు హాస్పిటాల్ ఓడమునిగెను- గ్లఫూడాకేపువద్ద ఒక చిన్న ఓడపైకూడ జర్మను విమానాలు బాంబులు వేసినవి ఈదాడులలో మూడుజర్మనువిమానాలు క్రిందకూల్చివేయబడినవి- ఏప్రిలు ౧౩ వ తేదిజర్మనువిమానాలు సరజెవోఅను యుగోస్లావుపట్టణంపై బాంబులు వేసినవి-

### అల్బేనియాలో ఇటలీగ్రీసుల యుద్ధము

ఆల్బేనియాలో గ్రీకులుఇటాలీయులను విస్మయభ్రాంతులనుగచేసియున్నారు. అక్కడ ఏప్రిలు ౧౧ నుండి ౧౪ వ తేదివరకు విశేషాలేవీలేవు ౧౦ వ తేదిన ఉత్తరభాగంలో ఇటాలీయులు రెండుసార్లు ముందుకుత్రోసికొనివచ్చి, గ్రీకుల చేతరుమబడిరి-ఏప్రిలు ౧౨ వ తేదిన అప్రూస్ న దక్షిణమున పైకివచ్చినఇటాలీయసేనలు తరిమివేయబడినవి-

## గ్రీనులెండులో అమెరికావారి విమానాశ్రయ స్థాపనము

### డేనిష్ మంత్రితో ఒడంబడిక

అమెరికావారు గ్రీన్ లెండులో విమానాశ్రయముల నేర్పరచుచున్నారు.

డెన్మార్కు జర్మనీవారివశముననున్నదను విషయమును సరకుచేయక అమెరికావారు అంతర్జాతీయముగా నత్యంత ప్రాముఖ్యంవహించు నీ క్రొత్త యెత్తుయెత్తియున్నారు. డేనిష్ మంత్రి డీ కాఫ్ మెను గారితో యిప్పుడొక ఒడంబడికచేసుకొనబడినది, ఈఒడంబడికద్వారా గ్రీసులెండు అమెరికావారిరక్షణక్రింద రాగలదు. గ్రీసులెండురక్షణముకును, పశ్చిమార్ధగోళ రక్షణమునకును గ్రీసులెండులో అమెరికాసంయుక్త రాష్ట్రవిమానాశ్రయముల నేర్పరుచుట!ఒడంబడిక ఉద్దేశింపబడినది, ఈఒడంబడికపై ఏప్రిలు ౯ వ తేది బుధవారము రాత్రి సంతకములుజరిగెను. అమెరికా సం॥రా॥పక్షమున కార్డెల్ హల్లుగారును, డెన్మార్కుపక్షమున డీకాఫ్ మెనుగారును సంతకములుచేసిరి.

ఒడంబడిక విషయమై రూజువెల్టుగారు ప్రస్తావించుచు గ్రీన్ లెండు డేనిష్ కాలనీగా నుండునట్లుచూచుటయే తమఉద్దేశ్యమని చెప్పెను.

రూజువెల్టుగారి కార్యదర్శి ఒడంబడికవిషయమై ఈక్రిందివిధముగా చెప్పెను.

జర్మనువిమానములు గ్రీసులెండుమీద ఎగురుచున్నవనువిషయము తెలిసినమీదటనే ఈఒడంబడిక చేసికొనబడెను విదేశములనారిక్రిందనున్న అట్లాంటికుదీవులేవియుగాపాడబడునో గ్రీసులెండుగూడ అవిధముగాపాడబడును ఈపద్ధతిమన్రోడాక్ట్రినుకును, గతసంవత్సరము హవానా కాన్ఫరెన్సులో సంతకమైనఅంగీకార పత్రమునకును అనుగుణముగానున్నది-శత్రువులుగ్రీసులెండుపైకివచ్చుచో గ్రీసులెండురక్షింపబడును ఇదివరకొకసారి కెనడారక్షణకై అమెరికావారిట్టిచర్యలుగైకొనియుండిరి. జర్మనీ సైనికులు డెన్మార్కుపై దండయాత్రచేసియిప్పటికొక సంవత్సరమైనది, సాంవత్సరిక సమయమున ఈఒడంబడికజరిగినది. జర్మను లశ్రుంఖలలనుండి డెన్మార్కు త్వరలోవిముక్తి యగుగాక. అనిమేము హృదయపూర్వకముగావాంఛించుచున్నాము.

### కాలనీలకు అమెరికావారి సప్లయిలు

ఖండాంతరములయందు గల కాలనీలకును, నౌకావిమానాశ్రయములకును అమెరికానుండి సైనికులను, సప్లయిలనుపంపుటకు సైనికనావలన్నియు నియమింపబడినవి ఖండాంతరములయందలి ఆశ్రయములన్నిటియందును సంపూర్ణముగా సైనికవార్తానిరోధపద్ధతి (మిలిటరీ సెన్సార్ షిప్) యేర్పరుపబడెననికూడ తెలుపబడెను.

హవాయ్, ఫిలిప్పైనులు, కెనాల్ ప్రాంతము, క్రొత్త అట్లాంటికువిమాన, నౌకావిమానాశ్రయములలో అమెరికావారు చర్యలుగైకొనుచుండుటవలన సప్లయినావలన్నియు కావలసియున్నవని యుద్ధశాఖసహాయకార్యదర్శి రాబర్టుపాటర్ సన్ గారుచెప్పిరి. ప్రయాణీకులను, సామానులను తీసికొనిపోవు ౨౩ నావలుగాక, మరిపది నావలను యుద్ధశాఖవారింకకుగాను పుచ్చుకొనిరి

# జవహర్లాలుగారికి హిట్లరు ఆహ్వానము

## జవహర్లాలుగారు నిరాకరించినవిధము

పండిత జవహర్లాలుగారు యూరోపుఖండమందు సంచారముచేసి నపుడు వారుఇటలీకిపోగా అక్కడిముసోలినీగారినుండి పంపించిన ఆహ్వానమును జవహర్లాలుగారు ఏవిధముగ నిరాకరించి యుండిరో యడ్వర్డుథామ్సనుగారు ప్రకటించియుండిరిగదా! ఇపుడు డాక్టరునా రాయణదత్ విద్యాలంకారుగారు ఒకహిందీపత్రికలో హిట్లరునుండి వచ్చినఆహ్వానంనుకూడ జవహర్లాలుగారు నిరాకరించినవిధమును తెలియజేసినారు. ఆకథ యీక్రిందివిధముగనున్నది.

ఆది ఆగష్టు ౫ వతేదిఉదయము పండిత జవహర్లాలునెహ్రూగారు మ్యూనిచ్‌కువచ్చినట్లు పారిస్‌నుండి నాతమ్ముడు టెలిగ్రాముపంపెను. ఆగష్టు ౫ వతేదిన పండిత నెహ్రూగారు మ్యూనిచ్‌కుచేరిరి. స్టేషనువద్ద పండితునిసన్మానించుటకై భారతీయవిద్యార్థులేగాక ౩౦౦ మంది, జర్మనువిద్యార్థులుకూడఉండిరి పండితునితోగూడ వారిసుమాత్రాగూడవచ్చెను,

ప్లాట్‌ఫారముపై పండితునికి పూలమాలవేసినతర్వాత అందరునుజయఘోషలుచేసిరి, జర్మనువిద్యార్థులు, తదితరులునుగూడ జయఘోషలజేసిరి. అంతమేము మ్యూనిచులో ప్రసిద్ధమైనట్టి "హోటెల్‌వీర్ జ్యాహెజెటెన్" అను హోటలు కుపోతిమి.

### జర్మనులతో కార్యక్రమముతొలగించుట

పండితునికి విశ్రాంతిచిక్కినతర్వాత, నేను మ్యూనిచులో వారికార్యక్రమమునువిశదముచేసితిని. అందులో ఒకవిందుఏర్పాటుకూడచేరియుండెను, ఈవిందుకు మ్యూనిచ్‌లోనికొందరుజర్మనులు ఆహ్వానించబడిరి. వారలుపండితనెహ్రూగారితోసంభాషించునట్లు ఏర్పాటుఉండెను పండితునికదిఇష్టముకాలేదు. 'నేనిక్కడికి నాసొంతవ్యవహారమునకైవచ్చినాను. ఈదేశములోతిరిగిపోవుటనవిమాత్రమే నాఉద్దేశ్యము ఏవిషయముసుకూర్చిగాని ఏజర్మనునితోగాని మాట్లాడుటకు నాకిష్టములేదు. భారతీయులతో మాట్లాడినా రఅసంగతి తెలిసికొన్నచో నాకుచాలును కాబట్టి నేను జర్మనులతో మాట్లాడవలసినట్లుండే అంశములను తొలగించివేయుము అనిజవహర్లాలుగారుస్పష్టము గాకోరిరి.

### గబ్బెల్సుగారి టెలిఫోనుపిలుపు

మరునాడుఆగష్టు ౭ వతేదినపండితుడు ప్రొద్దుటిభోజనముముగించుకొని జర్మనీలోని భారతీయవిద్యార్థులనుగురించివిచారణలు చేయుచుండెను. అప్పుడు టెలిఫోను నన్నువదలేటట్లులేదే"యనిపండితుడనెను, ఆఫోనుపిలుపు హోటలుమేనేజరునుండివచ్చియుండెను. అతనివచ్చేరానియింగ్లీషుసరిగాఅర్థముకాక, పండితుడునన్ను ఆమేనేజరుతో మాట్లాడవలసినదిగకోరెను. జర్మనీయొక్కప్రచురణశాఖమంత్రియగు డాక్టర్ గబెల్సుగారు పండితనెహ్రూగారిని దర్శించుటకైవచ్చియున్నాడు. ఇపుడుపండితుడు దర్శనమిచ్చునా' అనిఆమేనేజరుచెప్పుచుండెను. ఈ సంగతినినేనుపండితునికి తెలిపితిని గబెల్సుగారితో మాట్లాడుట అనవసరమని పండితనెహ్రూగారుతలచిరి ఆయనను 'సరేమంచిదిరమ్మను'' అనిచెప్పిరి. నేను హోటలుమేనేజరుగారికి 'డాక్టర్ గబెల్సుగారు రావచ్చునని పండితనెహ్రూగారనుచున్నారు'' అనిచెప్పితిని.

### హిట్లరునుండి సీలుచేసినలేఖ

రెండునిమిషములలో హోటలుభృత్యుడు గబెల్సుగారికార్డును పండితగారికందజేసెను. పండితునిఆజ్ఞపై నేను గబెల్సుగారిని లోపలికిపిలిపించితిని గబెల్సుగారుగదిలోనికివచ్చినవెంటనే జర్మనులుకోరినప్రకారము "హెయిల్ హిట్లర్" అనిఅంటూ తన చేయి యెత్తి వందనముచేసెను. పండిత నెహ్రూగారుకూడ కుర్చీనుండిలేచి భారతీయసంప్రదాయమునకుతగినట్లు చేతులుజోడ్చినమస్కరించి గబెల్సుగారిని సత్కరించిరి. పండితునికూతురు ఇందిరా నెహ్రూగూడ అపుడక్కడనే యుండెను. నేనామెను డాక్టర్ గబెల్సుగారికి పరిచయముచేసితిని. ప్రక్కనఉండిన ఒకసోఫానుచూపి నేను గబెల్సుగారిని అక్కడకూర్చుండవలసినదంటిని. డాక్టర్ గబెల్సుగారు సంపూర్ణమైనికశేషముధరించి, వక్షస్థలముపై పతకములు ప్రకాశించుచుండ నిలుచుండి, "నేనునిలుచున్నందువల్ల నాకుకష్టమేమిగాని లేదు"అనిచెప్పిరి. మరలపండితుడువారినికూర్చుండగోరిరి. అప్పుడు డాక్టర్ గబెల్సుగారు సోఫాలోకూర్చుండిరి

డాక్టర్ గబెల్సుగారు పండితునితో కొంచెము కొన్నిమాటలు మాట్లాడినతర్వాత వారికిసీలుచేసిన ఒకకవరునిచ్చిరి. "అందులో ఏమిఉన్నది"అనివారుఅడుగుచు, కవరునువిప్పితీసిచదివిరి. కొంతసేపుఆలోచించి వారాకవరును నాకిచ్చిరి. నేను దానినిచదివి, అది హెర్ హిట్లరునుండి వచ్చినదని కనుగొంటిని. హిట్లరుపండితునిచూడగోరి అజాబువ్రాసెను మీరువచ్చిమాట్లాడినచో నాకు చాలాసంతోషంగా ఉంటుంది-అని ఆ జాబులో ఉండెను.

### నెహ్రూగారి నిరాకరణ

తానుసొంతపనిపై వచ్చినట్లును, అందువల్ల హెర్ హిట్లరుతో మాట్లాడవలసినఅవసరము తనకులేనట్లును, జర్మనీలో తానుసంచారముచేయుటలో ఎట్టిరాజకీయోద్దేశ్యముకాని తనకులేనట్లును, తానుసంచారము ముగియగానే ఇంటికి వెళ్ళగలనట్లును డాక్టర్ గబెల్సు గారితో చెప్పవలసినదని పండితుడు నన్నుకోరెను. హిట్లరుతోకలిసి మాట్లాడుటకు పండితునికిష్టములేకుండెను. నేను పండితుడుచెప్పినమాటలను జర్మనుభాషలో డాక్టర్ గబెల్సుగారికి చెప్పితిని డాక్టర్ గబెల్సుగారు సంభ్రాంతులైరి, అటువంటి కఠినమైనజవాబు వచ్చునని గబెల్సుగారు ఎప్పుడు గాని అనుకొని యుండకపోవచ్చును. డాక్టరుగబెల్సుగారు కొద్దిసేపుఆలోచించి కొంతధైర్యముతెచ్చుకొనిఇట్లు చెప్పిరి. "మా ప్రభుత్వమువారి సత్కారమును అంగీకరించుటకు మీరిష్టపడుచో, మిమ్ములను గౌరవించుట మాఅదృష్టమగును. మీరిక్కడ ఉన్నపుడు ప్రభుత్వమువారు మీకు అన్నిసౌకర్యములనుచేసెదరు" పండితుడు మందహాసముచేసి వారితోనిట్లనెను. "నాభారతీయ మిత్రుల ఆతిథ్యమును అనుభవించుచున్నను నాకు సంపూర్ణముగా సౌకర్యముగానున్నదని వారికి చెప్పుము. కాబట్టి జర్మనుప్రభుత్వమును ఆయాసపెట్టుట నాకిష్టము లేదు"

## ఎముకలలో సంపద

- పైర్లకు ఎరువులు
- ఆఫీసులకు గోందు
- తుపాకీమందుకు గ్లూ

హిందూస్థానంలో ఎముకలనుముట్టరు. వాటిని పారవేస్తారు. మనమీవిధంగా ఉపాయం తెలియనివారమై దరిద్రులమౌతున్నాము: యూరోపు అమెరికాఖండాలలో ఎముకలయొముకలనుండి లక్షలు కోట్లుసంపాదించుచున్నారు. ఎముకలను కుక్కలకుగూడా వెయ్యరు, ౧౦౦ టన్నుల యెముకలనుండి ౫౦ టన్నులయెరువులను సిద్ధముచేస్తున్నారు. అవియెరువులలో యెముకలయెరువు చాలాశ్రేష్ఠమైనది పై ౧౦౦ టన్నులయెముకలలో ౫౦ టన్నులయెరువుకేకాకుండా ౧౨ టన్నులగోందును ౧.౨౪ టన్నుల గ్రీజునుతయారుచేయుచున్నారు. పెద్దపెద్దకచ్చేరీలలో "గ్లూ" అనుపేరుతో తిరుమతియగు సీసాలగోందునువాడుతారు. అదియెముకలనుడికించి చేయబడినపదార్థం

ఇంతేకాదు ఈ "గ్లూ"ను గ్రీజుకలిపి గ్లిసరిన్ అనేవస్తువును సిద్ధముచేస్తారు, దీనిని తుపాకిమందుకున్ను, రంగులకున్ను, వాడుతారు. విమానాలునిర్మించేదానిలో గ్లూను అపారంగావాడుచున్నారు కొవ్వులుపచ్చియెముకలనుండి గ్రీజుచేస్తారు. తర్వాతయెముకలను శుభ్రముచేసిమిషనులోవేస్తారు దానినుండి ద్రవరూపంగా గ్లూబయటికివస్తుంది దీనినియెండించి పొడిగాచేసి తుపాకీమందుకువాడుతారు. ఈయుద్ధంరాకముందు ఇంగ్లాండులో ఏటేట ౨౫ వేలటన్నులయెముకలను వ్యర్థముగాపారవేస్తూవుండిరి. ఇప్పుడు యెముకలనుభద్రపరచండిఅని ప్రచారంచేయడంచేత ప్రతిఒక్కటన్ను యెముకలకు ౭౦ షిల్లింగులు అనగా ౪౭ (కల్దారు) రూపాయిలు లభించుచున్నవి. ఇంకను ఇంగ్లాండుదేశంలో యెముకలుచాలాకవస్తున్నవి అందుచేతఏటేట ౨౦౦౦౦ టన్నులయెముకలను తమదేశములోని దిగుమతిచేసుకొనుచున్నారు.

## సదాశివపేట

### శ్రీ రామనవమి

(విలేఖరి.) ౮-౪-౪౧

వేడిగ్రుడ్డ ఆర్యసమాజ మందిరములో శ్రీ రామనవమి జన్మదినోత్సవము మహావైభవంగ జరుపబడెను. ఉదయం ఎనిమిది ఘంటలకు హవన సంధ్య ప్రార్థనాదిక్రియలు జరుపబడెను. సాయం॥ అయిదు ఘంటలకు సభ చేయబడెను. జనసంఖ్య రెండువందలకు మించియుండెను. పం. శివచంద్రశేఖరు గారు వేంచేసియుండిరి. పూర్వము మంత్రిఈశ్వరభజనలు పాడిరి. తర్వాత పం. నారాయణ్రావుగారు పం. పరమానందగారు వీరలిద్దరు భజనీకులు భజనల ద్వారా ఉపస్థితి జనులనను రంజిలునట్లు ఆనందాన్ని మించిరి,

అనంతరమాష్టర్ పం శివచంద్రశేఖరు గారు శ్రీ రామన్యాయమూర్తి పరాక్రమశాలియను దానిని అనేకరీతుల వీరపరాక్రమముల పొగడి ప్రాచీన కాలములో ఆర్యుల విజ్ఞానాతిశయముల స్మరణ కరప్పించి మహాగంభీర భాషణ కావర్చిరి. తర్వాత శంకర్రావుగారు, శ్రీ విశ్వనాథ్ గారు మహాగంభీరభాషణలు చేసిరి అనంతర శాంతిపాఠముతో మహా సభ విసర్జింప బడెను. మరువాడు సోమవారం సాయం॥ ఆరుఘంటలనుండి సభగావింపబడెను. జనము క్రిక్కిరిసియుండెను. పం. శివచంద్రశేఖరు గారు భజనానంతరము ఆర్యుల ప్రాచీన సంస్కృతి జ్ఞప్తికి తెచ్చి వైదికమహాత్మ్యముల పొగడి వేదములనుండి విదేశీయులు నెట్లు వేరొలాభములపొందిరి. మనము వేదముల మరచినందున నేరుఁ నష్టములలో బడితిమి. నేడ మనము ఐక్యతను పొందవలెనన్న, ఉన్నతికి రావలెనన్న వైదిక ధర్మము స్వీకరయించవలయును. సమాజమునుద్ధరించిన మతసుద్ధారము కాగలదని యింకనేక రీతుల ఆత్యోత్తమ ఉపదేశములుగావించిరి. శాంతిపాఠము తథా జయజయధ్వనులచే సభవిసర్జింప బడెను.

—

## నిజాంరాష్ట్ర పద్మశాలి ప్రథమమహిళా మహాసభ

—

మానుకోట

—

మానుకోటలో చైత్ర శు॥ ౧౪ శుక్రవారము ఉదయం ౧౦ గంటలనుండి ౨ గంటలవరకు పై మహాసభజరుపబడెను. సికింద్రాబాదు వాస్తవ్యురాలగు శ్రీమతి గిడితూరి రామానుజమ్మగారు అధ్యక్షతతో సభసమావేశము జరిగెను.

కుమారి చి॥ కూర్మకమలాబాయి ప్రార్థనానంతరము శ్రీమతి తాటి పాపమ్మగారు ప్రారంభోపన్యాసము గావించినతరువాత శ్రీమతి వనం లక్ష్మమ్మగారు కమలవాఁన సంఘాధ్యక్షోపన్యాసము చదివిరి. అధ్యక్షురాలు కరతాళధ్వనులచే సభాపీఠమలంకరించి తమగంభీరోపన్యాసముచదివిరి. మరికొందరు యువకులు ఉపన్యాసములతరువాత సంఘోన్నతికరమగు (౮) తీర్మానములుగావింపబడెను. కార్యదర్శిగారు సభికురాండ్రకు కృతజ్ఞతాభివందనములు తెలుపుచు సభముగింపబడెను,

ఈక్రిందితీర్మానాలామోదింపబడినవి:—

మనసంఘములో అతిబాల్యవివాహములుజరుగుచున్నందువలన చాలఅనర్థములుగలుగుచున్నవి గనుక ప్రౌఢవివాహములు జరిపింపవలయునని ఈ సభవారుకోరుచున్నారు.

మగవారు వెట్టిచేయరేదను కారణములచేత గ్రామాధికారులును మక్తేదారులును, ఆకుటుంబమందుగల స్త్రీలను అక్రమముగా హింసపెట్టుచున్నందులను ఆట్టిక్రూరులచర్యలను ఈసభవారు నిరసించుచు ఇట్టిఅక్రమవర్తకులను విచారించి తీవ్రమైనశిక్షలనొసంగవలయునని ఈసభవారుకోరుచున్నారు

—

# నిజాంరాష్ట్ర పద్మశాలి ద్వితీయ మహాసభ

—

## పద్మశాలీయుల కష్టములనుగురించి తీర్మానాలు

—

(ప్రత్యేకవిలేఖరి)

మానుకోట, ఏప్రిలు ౧౨

నిజాంరాష్ట్రమున ఆంధ్ర జిల్లాలలో ప్రఖ్యాతిగడిచిన ప్రాచీనకాలమున ఆంధ్రసామ్రాజ్యమునకు ఆలవాలమై నొప్పుచున్న వరంగల్ జిల్లాలో చేరిన మానుకోటతాలూకాయందు సుప్రసిద్ధవైద్యులును మున్సిపల్ కార్పొరేటర్ మెంబరగు శ్రీమాన్ వైద్యానువైద్య హకీంవనమాలనారాయణదాసు గారి అధ్యక్షతతో మానుకోటలో నిజాంరాష్ట్ర పద్మశాలి ద్వితీయమహాసభ జరిగెను. ఈసభలు ప్రథమమునుండి జరుపుటకు నెక్కువ ప్రోత్సాహపరచిన ఆ.భా. పద్మశాలీయమహాసభ ప్రధాన కార్యదర్శియగు యువకశిరోమణి శ్రీమాన్ గుంటక నరసయ్య పంతులుగారు నిజాంరాష్ట్రమున గావించిన నిరంతర సేవాఫలితమే ఈనాడు నిజాంరాష్ట్రసభలయొక్క ప్రతిబింబమైయున్నది. ఇట్టి అకలంక సేవాపరాయణుని సేవను నిజాం రాష్ట్రీయు లెన్నటికిని మరువజాలరు.

చైత్రశు॥౧౨ బుధవారంసరియగు ౫ఖుర్దాదు ౧౩౫౦ఫసలి ఉదయం౮గంటలకు స్వయంసేవకులు జాతీయగీతములుపాడుచు శ్రీమాన్ వనం క్రిష్ణమూర్తి హైకోర్టువకీలు గారిభవనమునుండి "బహూత్తమనగరం"వరకు అధ్యక్షులవారి ఊరేగింపు జరిగెను

తదుపరి వైద్యభూషణ హకీం దావళుజనార్దనముగారు "బహూత్తమనగర" ప్రారంభోత్సవమును, పతాకారోహణమును జరిపిరి. అనంతరము అధ్యక్షులవారు మరియు ప్రతినిధులు సదామంటపమున ప్రవేశించిరి. అధ్యక్షులవారు పీఠమలంకరించిరి. వరంగల్ జిల్లా వేదవిద్యార్థిసంఘమువారిచే ప్రార్థనలుజరిపినతరువాత అధ్యక్షోపన్యాసము చదువబడెను.

గతమహాసభ కార్యనివేదిక సహాకార్యదర్శి బత్తెంకల రామచంద్రయ్యగారు చదివి సభసురాజాలనివారిసందేశములు చదివిరి, సభ౧-౨గంటలకు ముగింపబడినది. భోజనానంతరము ౨గంటల నుండి ౪గంటలవరకు కార్యాలోచనసభ జరిగెను.

రెండవసమావేశము ౫గంటలనుండి జరిగెను. తరువాత తీర్మానములుప్రవేశపెట్టి ఆవరి సమ్మతముతో యేకగ్రీవము గాతీర్మానింపబడినవి. నీసభలకు నల్లగొండ,కరీంనగరం. మెదకు వరంగల్ జిల్లాలనుండి ప్రతినిధులుపాల్గొనిరి. స్థానిక హిందు మహమ్మదీయ నాయకులును ప్రభుత్వాధికారులును నీసభకునువారు రమారెనిమిదివందల ప్రతినిధులు, ప్రేక్షకులుపాల్గొని రాత్రిపదిగంటలకు జయప్రదంగా ముగిసెను.

### తీర్మానములు

సభవారు ఈక్రిందితీర్మానాలను చేసిరి:

వెట్టిచాకిరి కొన్నిగ్రామములలో జాగీరుమక్తాలలో గ్రామాధికారులు యీకులమందలివారిచే బలవంతముగా వెట్టిచాకిరిచేయించుకొనుచున్నారు, చేయక నిరాకరించినవారిని నానాయిక్కట్టులు గలిగించిభాధించుచున్నారు. కనుక ఆట్టివారిపై శ్రీనిజాంప్రభువర్యులు తమజన్మోత్సవసందర్భమున (౧౩౪౯-౧౩౫౦) వెలవిచ్చిన ఫర్మానా అరింపనుచితంటనే తగుచర్యతీసుకొనవలసినదిగాకోరుచు యీవెట్టిచాకిరి అపుటకుతగు ఆజ్ఞచేయవలసినదిగా ప్రభుత్వమువారినియీ సభవారుకోరుచున్నారు,

మ. ఘ. వ. నిజాం ప్రభువర్యులు మొగ్గముపన్ను (మొహత్రఫా). నిషేధించినను యింకాకొన్ని జాగీరు, ముక్తాలలోవిర్బంధముగా వసూలుచేయుచునేయున్నారు, గానయీపన్నుమునారి వృత్తిహీనతను గమనించిదానినిపూర్తి తొలగించగలందులకు ప్రభుత్వమువారిని యీసభవారుకోరుచున్నారు.

అదికాలములో బ్రాహ్మణులకుండినవస్త్రనిర్మాణముచేసిన జాతివారికిరాజులు. ప్రజలు "పద్మశాలి" యనుగౌరవపదవియొసగియున్నారు గనుక యీ జాతివారిని, జాండ్రె, సాలెయను నీచనామములతో వాడుకొనడమునిగుల అవమానకరము గాన యికమీద అటులవాడబూడదనియు భూపరిష్కరనియమావళిలో, సాలియనియున్నదికాబట్టి "పద్మశాలి"యని సవరించవలయుననియు, జనపరిగణనలెక్కలలో పద్మశాలీయని చేర్చవలసినదిగా ప్రభుత్వమువారిని యీసభవారు కోరుచున్నారు.

జరుగనున్న సంస్థానపు సంస్కరణలందుయీకులముయొక్క సంఖ్య ననుసరించి పరిశ్రమలకుగా నేర్పరచిన రెండుస్థానములనుండి నొకస్థానము యీజాతికి సంబంధించినవారికొసంగవలయుననియు, అటులే జిల్లా, తాలూకా గ్రామసంఘములయందు తగుఏర్పాట్లుగావింపగలందులకు శ్రీ ప్రభువుగారిని యీసభవారుకోరుచున్నారు.

ఈకులమువారి వృత్తిపడిపోయినందువలనచాలనీచస్థితికివచ్చియున్నారు. కానప్రభుత్వమువారు వీరివృత్తిని కాపాడుటకై నవీనపద్ధతులబోధించుచు వలయుసౌకర్యములన్నియు గావింపవలయునని యీసభవారుకోరుచున్నారు

ఈజాతివారి విద్యాభివృద్ధికై ప్రాథమికఉన్నత పాఠశాలలలో ఉచితముగా విద్యగరుపుటకును ఏర్పాట్లుగావింపగలందులకును ప్రభుత్వమువారిని యీసభవారు కోరుచున్నారు.

ఈకులమందలి ఉన్నతవిద్యనభ్యసించినవారికి జాతిసంఖ్యననుసరించి తగుఉద్యోగములనిచ్చి ఉత్సాహపరచగలందులకు ప్రభుత్వమువారిని యీ సభవారు కోరుచున్నారు.

ప్రభుత్వమువారి సైన్యాలకు కావలసినగుడ్డలన్నిచే నేతగుడ్డలనేవాడి యీజాతివారినిరక్షించవలయునని ప్రభుత్వమువారిని ఈసభ గారుకోరుచున్నారు.

ప్రతిజిల్లా తాలూకా లోకల్ ఫండు బోర్డులలో జాతిసంఖ్యననుసరించి మాకులమువారికి తగు ప్రాతినిధ్యమిప్పించగలందులకు ప్రభుత్వమువారిని యీసభవారు కోరుచున్నారు.

నిజాంరాష్ట్రములోని నేతయంత్రశాలలలో యితరజాతిసంఖ్యతగ్గించి మాజాతివారికుద్యోగములనిప్పించినట్లయితే యితరరాష్ట్రములకు వెళ్ళుచున్నవారు నిజాంరాష్ట్రసోదరులీరాష్ట్రమందే జీవించగలరని ప్రభుత్వమువారిని యీసభవారు కోరుచున్నారు.

మనజాతివారు శుభాశుభకార్యములన్నిస్వకులపురోహితులవల్లనే జరుపుకొనవలయుననియుస్వకులపురోహితమునకు విరోధము గానడచు కులాలపై ప్రముఖులు తగుచర్య తీసుకొనవలయునని యీసభవారు తీర్మానించుచున్నారు.

మనకులబాలురకు ఉపనయనము సకాలమున తప్పక చేయవలయుననియే సభవారుతీర్మానించుచున్నారు

మనకుసంబంధించినరేగవుతెల్ల కోర్టుకచ్చేరీలకువెళ్లకుండ కులములోపరిష్కారము చేసికొనవలయుననియు దీనికివ్యతిరేకించినడచినవారు తాలూక, జిల్లా సదరుసంఘముయొక్కశిక్షకు పాత్రులగుదురనియు యీసభవారు తీర్మానించుచున్నారు,

మనజాతివారందరు అన్యకల్పితవస్త్రధారణమొనర్పక మనచేనిర్మింపబడినవస్త్రములనే తప్పకధరించవలయునని యీసభవారుతీర్మానించుచున్నారు,

మద్యపానమువలన మనకులమువారు దరిద్రదశలోచేరినది ఇకమైనకన్నులుతెరచి కులజాతెల్లరు యీఅలవాటును వెంటనేమానుకొని కులగౌరవమును, నిలుపవలయునని యీసభవారు తీర్మానించుచున్నారు.

కులగురువులమని చెప్పుకొని సంఘమునుపీడించుగురువులనేవను మానవలెనని యీసభవారు తీర్మానించుచున్నారు.

వివాహాదిశుభకార్యములలో కార్యస్థులు కులకట్టడులు యికమీదటయిక్కసక తాంబూలముతో మాత్రమే సత్కరించవలయునని యీసభవారు తీర్మానించుచున్నారు.

బంధువులతో బంధువులపోట్లాడి యీర్ష్యలు సాధించుకొనుటకుగాను తమయిండ్లయందు కార్యరముచేయుకొడుకులను కోడండ్లను విడాకులు యిప్పించు దురాచారపద్ధతులు తొలగించవలయునని యీసభవారు తీర్మానించుచున్నారు.

తుదకు ఈక్రింది కార్యవర్గము ఎన్నుకొనబడినది.—

అధ్యక్షులు హకీం వనమాల నారాయణదాస్ గారు, ఉపాధ్యక్షులు కొండ రాంబాన్ రావు, వనంకృష్ణమూర్తిగార్లు సంయుక్త కార్యదర్శులు—బత్తెంకల రామచంద్రయ్య, కటకం శ్రీరంగంగార్లు. ఇతరసభ్యులు— పసిడిమన్తీయల్లయప్ వకీల్ హైకోర్టుగారు (నల్లగొండ). మార్కవీరయ్య (మానుకోట), నక్క వెంకటస్వామి. యల్లండి అనంతయ్య, కొండలక్ష్మణ రావ్, (హైద్రాబాదు). మంగళిపల్లినర్సింహులు (సికింద్రాబాదు)- కుసుమ నర్సయ్య(వరంగల్), పనుపల్ల శంకరయ్య (పెద్దపల్లి), అంబర్ల నరిసిములు[నిజామాబాద్], కందినాగయ్య [జోగిపేట]

—

# గోలకొండపత్రిక

వృషనామసం౹౹ర చైత్ర బ౹౹ ౬

గురువారము


## వ్యవసాయ శాఖా నివేదిక.

ఫసలీ ౧౩౪౯ నాటి హైదరాబాదు రాష్ట్రీవ్యవసాయ శాఖ నివేదికనందుకొన్నాము. నివేదికలో శాఖావారు చేయుచున్న కృషినిగురించి వ్రాసియున్నారు. అన్నిశాఖలపైకి వ్యవసాయశాఖయే రాష్ట్రములోని రైతులకు ప్రధానమైనదిగా నుండవలసిన అవసరమును రైతులును ప్రభుత్వమువారును గుర్తించియున్నారు. ఏలననగా భారతదేశమందలి యితరప్రాంతములవలెనే ఈరాష్ట్రములోను నూటికి ౭౦ మందివరకు వ్యవసాయముపైననే ఆధారపడియున్నారు. మనవ్యవసాయశాఖలో కొన్నిముఖ్యమగు మార్పులుఅవసరమని మాఅభిప్రాయము. శాఖలోని ఉద్యోగులందరును ముల్కీలుగా నుండవలెను. అందు సగముమందియైనను అనువంశికవ్యవసాయదారులుగా నుండవలెను. ప్రతివ్యవసాయోద్యోగికి తెలుగుమరాటీకన్నడీలలో ఒకభాష బాగుగావచ్చి తీరవలెను. లేకున్న రైతులకును వీరికినిమధ్యగోడపెట్టినట్లుండును. ఉభయులకును సంబంధము కొద్దిగానే ఉండును. ఎప్పుడైన సంబంధము కలిగించుకొను అవసరముండినచో దుబాసీల అవసరముకూడా ఏర్పడును. వ్యవసాయశాఖవారి ప్రచారమంతయు ముల్కీభాషలోనే ఉండవలెను. రైతులకు తెలియనిభాషలో ప్రచారముచేసిన అదిరైతులకు లాభించనేరదు.

మనరాష్ట్రపు వ్యవసాయస్థితి చాల అనాగరికముగాను చాలాపాతకాలపు మోటుపద్ధతిగాని ఉండని పలుమారు వ్రాసినాము. స్థితిగతులలో వ్యక్తమగు మార్పుకానరానందున మాపాతఅభిప్రాయాన్ని మార్చుకొను అవసరముకూడా కానరాదు. వ్యవసాయశాఖవారు విత్తనము లెట్టివిగా నుండవలెనో గుంటకలు నాగళ్లు, గొర్లు, జడిగములు. మున్నగునవి యెట్టివిగా ఉండవలెనో ఏ యే భూములకు ఏయేపంటలవసరమో పగిలి యేవిధముగాచేసిన చేలకు లాభించునో పంటలకు తగులు రోగములను నిర్మూలించుటయెట్లు, తోటలవలన ఎట్లురైతులులాభముపొందగలరు, రైతులకు వ్యవసాయమేకాక ఉపవృత్తి యే యే ప్రాంతాలలో యేది అవసరమో ఇదంతయు దేశభాషలలో బోధించి ప్రచారముచేసి లఘుగ్రంథాలను విరవిగాముద్రించి అగ్గువగా అమ్మించవలెను. చెలకభూములకు తెలంగానావాసులు బొత్తిగా యెరువులు వేయరు. చెలకలలో పండు పంట చాలానష్టకారిగాఉండును. కొన్ని సమయాలలో ఆపంటపన్నుకు సరిపోదు. కొన్ని సమయాలలో కూలికికూడ సరిపోదు. "పునాసపంట ఒక్కనాటివంట" అని చెలకపంటలనుగురించి తెలంగానాలో సామెత అయిపోయినది. ఇక రైతు మాతమాపన్నిఋణవబాధలక్రిందపన్నులు నానావిధాలుగా ఉండుట, మోటక్రింద రైతు, రైతుయెద్దులు, క్షీణించిపోవుట, తుదకు లాభమేమియు లేకపోవుట అందరికిని తెలిసినవిషయమే. ఇట్టి స్థితిలో ఇట్టిదరిద్రములో ఇట్టిఅజ్ఞానములో ఉన్న తెలంగానా రైతు నుద్ధరించుటకై మనవ్యవసాయ శాఖవారు చాలాఉదారమైన సానుభూతి చూపవలసినవారైయున్నారు.

౧౩౪౯ నాటి నివేదికవలన వ్యవసాయశాఖవారు ప్రశంసాపాత్రముగా పనిచేయుచున్నట్లు తెలిసినారు. ముల్కీభాషలలో కొన్నికరపత్రాలను పంచిపెట్టినామనిన్ని పంటలరోగాలను పరిశోధనలుచేయుచున్నామనిన్ని పంటలలో కొన్నిలాభకారులైన రకాలపంటలనుపండించుటకు రైతులకు నేర్పించినామనిన్ని గ్రామపునరుద్ధరణకై కొన్ని కేంద్రాలనేర్పాటుచేసి మంచిప్రబోధము కలిగించినామనిన్ని తెలిపినారు.

గ్రామోద్ధరణము ౮ ఏండ్లనుండి భారతదేశమంతటను ప్రచారములోనికి వచ్చినది. మనసంస్థానములోను అప్పుడే ప్రారంభమైనది. హైదరాబాదు నగరానికి ౨౦ మైళ్లదూరమున రోడ్డుపైననే ఉన్న పటాన్‌చెరువుఅను పెద్దగ్రామము సమీపములో ఒక కేంద్రమును స్థాపించి అందు మంచి పనిని చేయుచున్నారు. ముఖ్యముగా కోళ్లపెంపకానికి పటాన్‌చెరువు ప్రసిద్ధిఅయిపోయినది. ఇట్టి కేంద్రాలు ప్రతి జిల్లాలోను ఉండుట చాలాఅవసరము. ఈఅవసరాన్ని ప్రభుత్వమువారు గుర్తించి కొన్నిటినిస్థాపించి ఒకప్రత్యేకమగుబోర్డునేనిర్ణయించినారు.

మొత్తముపై నివేదికచాల తృప్తికరముగా ఉన్నదని చెప్పవచ్చును.

---

## మ. ఘ. వ. ప్రభువుగారి తల్లిగారి మరణము

మ. ఘ. వ. నిజాం ప్రభువుగారి తల్లిగారికి ఒకమాసమునుండి అనారోగ్యము కలిగియుండెను. జాడ్యము దినదినము వృద్ధియగుచువచ్చెను. ప్రతిదినమును నాలుగైదుమారులు శ్రీవారు తమతల్లిగారి ఆరోగ్యాన్ని విచారించుకొనుచుండిరి. స్వహస్తముతో తల్లిగారికి ఔషధమిచ్చుచుండిరి కానితుదకు ౯ ఖుర్దాదునాటిరాత్రి ౨ గంటలసమయములో శ్రీవారితల్లిగారు మరణించిరి. ౧౦ ఖుర్దాదునాటి సాయంత్రముతల్లిగారి భౌతికశరీరమును గోరిలోనుంచి అంత్యకర్మలుకావించిరి. భౌతికశరీరమువెంట పురానాహవేలీనుండి జనాదుమసీదువరకును మ-ఘ-వ- నిజాంప్రభువుగారునడచివెళ్ళిరి. గొప్పఆసాములు నవాబులువెళ్ళిరి. పోలీసుసిబ్బందివెళ్లెను. హిందూ ముస్లిం దుకాణాలమూయబడెను నగరములోని కచ్చేరీలన్నియు మూయబడెను. మృతులైనవారు సుమారు ౭౦ సంవత్సరవృద్ధులైయుండిరి వారియాత్మకు శాంతి కలుగుగాక. శ్రీవారిప్రజలందరును శ్రీవారికి కలిగినవిపత్తునకు విచారపడుచున్నారు

---

## ఉమామహేశ్వరాంధ్ర గ్రంథాలయస్థాపన

[స్వ-వి-]

హైదరాబాదు-దక్కను, ఏప్రిలు ౯

పోయిన ఏప్రిలు ౩వతేదిన సాయంకాలము ౫ గంటలకు శీలాసాగాలో లక్ష్మీనారాయణతోటలో ఉమామహేశ్వర గ్రంథాలయప్రారంభోత్సవము శ్రీయుత కొండా వెంకటరెడ్డిగారి అధ్యక్షతక్రింద జరిగెను. శ్రీయుతులు రాజాబహదర్ వెంకటరామారెడ్డి (ఒ. బి. ఇ), అక్కి-నేపల్లి జానకిరామారావు, తేలుకుంట వెంకటేశ్వరరావు, మాడపాటి హనుమంతరావు గార్లు వెందలు సభామఖులుదయచేసిరి.

ప్రార్థనానంతరము అధ్యక్షునివిషయములైనకార్యక్రమములు శ్రీమతి పద్మయును కన్యకుంటేకరల్లు మలాను త దివినరి. కె. నాగభూషణంఅను విద్యార్థిగ్రంథాలయమునుగూర్చి వ్రాసికొనివచ్చిన వ్యాసమును కొకచదివినెను. డాక్టర్ రామస్వామినాయుడుగారుపన్యసించినపర్యాత శ్రీమాడపాటి హనుమంతరావుగారు గ్రంథాలయముతో తమ ౨౦ సంవత్సరములఅనుభవమును తెలిపిరి పిమ్మట శ్రీ రాజాబహదర్ వెంకటరామారెడ్డిగారు ఆశీర్వచనములుచెప్పిరి, గ్రంథాలయమును శ్రీమాడపాటి హనుమంతరావు, మురహరం ప్రతాపరెడ్డిగార్ల హితోపదేశముపొందుచు నడుపగలరనిచెప్పిరి.

తరువాత నివేదిక హరిగోవిందుఅను విద్యార్థి చేరనుబడెను. అధ్యక్షులవారు గ్రంథాలయమును స్వహస్తములతో తెరచిరి.

అధ్యక్షులవారికినిసభికులకును కృతజ్ఞతావందనములతో సభముగిసెను,

---

## హనుమజ్జయంతిలో హరిజనులతోసహా భోజనం

[ఒక విలేఖరి]

నారాయణపేట, ఏప్రిలు ౧౩

ఈగ్రామములో ప్రతిసంవత్సరం హనుమజ్జయంతి వార్షికోత్సవం జరుపబడుచుండును, మును పటివలెనే యీసంవత్సరముకూడ హనుమజ్జయంతి జరుపబడెను. శ్రీయుత బి. సాయిబ్బగారు బీదలకు అన్నదానముచేయుటకై పూరిలో చందా ప్రోగుచేసిరి- చైత్ర శు౹౹ ౧౪ గురువారంరాత్రి సృనపేటలో హనుమాన్మందిరమును పచ్చనితోరణముల, రంగురంగుకాగితములచే అలంకరించిరి రాత్రి ౯ గంటలకు మందిరములోఒక సభజరుపబడెను. బ్రహ్మచర్యమునుగురించి మరియు అంజనేయులజీవితమునుగురించి పండిత యస్, సాంబమూర్తి సిద్ధాంతరత్న గారు తెనుగుభాషలో ప్రసంగించిరి. తర్వాత శ్రీయుత రాందందర్ రావు పర్యటేగా ౘ హిందీభాషలో బ్రహ్మచర్యము, మరియు అంజనేయులజీవితమునుగురించి ప్రసంగించిరి రాత్రి ౧౦ గంటలకుసభముగిసెను. స్త్రీపురుషులు సుమారు ౨౦౦మందిగావచ్చియుండిరి రాత్రియంతయుభజనలచేజాగరణచేసిరి ప్రాతఃకాలము ౪ గంటలకు అంజనేయాలమునుండి నగరకీర్తనలుచేయుచు పురవీధులలోతిరుగుచు ఉదయం ౬ గంటలకు మందిరమువిచ్చేసిరి. తరువాత పూజలుజరిపి దేవాలయముపైన ధ్వజారోహణ చేయబడెను. గ్రామములో అన్ని స్థలములనుండి భక్తాలయము లలోయుత్సవజరుపబడెను. తరుపరిబీదలకొరకై అన్నమునండి ౧౧ గంటలకు భోజనముయేర్పాటుచేయబడెను, ముందుహరిజనులకు ఆహ్వానముపంపియుండిరి. సుమారు ౧౦౦ మందిహరిజనులు బాలురు, వృద్ధులు, యువకులు, స్త్రీలువచ్చిరి. వారితోసహా గ్రామపెద్దకాపులుకూర్చొని భుజించిరి. ఇట్లుచేయుటచే హరిజనసోదరులు చాలసంతసించిరి. వారిబాలురను, వైదికరాత్రిపాఠశాలకుతోలుచున్నారు వారికొరకై ప్రత్యేకంగా పుస్తకములు మరియు పలకలు, ఉచితంగాయిచ్చి విద్య నేర్పించేయేర్పాట్లుచేసియున్నారు. హరిజనబాలుర అమితఉత్సాహముతో పాల్గొనుచున్నారు. శ్రీయుత వెంకట్రావు బుచ్చప్పగారు హరిజనులస్నానాదులకుచేపెట్టుకొరకై తమభావిని ముక్తేటుకును అజ్ఞానసంగివారు ఉరజనులకై ప్రబుంచినన్యాచామ

---

## తుర్కీకి పంపే చముదు రుమేనియా ఆపివేయుట

రుమేనియానుండి యింతవరకు తుర్కీకిపంపుచున్న ట్యాంకులకటెంగుచమురును (అనగా యంత్రాలు గరగరలేకుండా మెత్తగా తిరుగుటకు వాడేపుడుచమురును) ఎప్పుడు తుర్కీకి పంపుట యానవేయబడినది. ఇప్పుడాచమురు రుమేనియాలోనే ఖర్చు అయిపోవుచున్నదట.

## కాంగ్రెసు సత్యాగ్రహము

### గాంధిమహాత్ముని మరతులు కరినతరమగుచుండుట

జబల్పూరులో శ్రీమతి సుభద్రాకుమారి చౌహాన్, యం. యల్. ఏ. గారు దేశరక్షణనిబంధనలక్రింద ఏప్రిలు ౧౫వతేది ఉదయమున అరెస్టు చేయబడిరి ఆమె యీదినముసాయంత్రము సత్యాగ్రహముచేయదలచియుండెను. తరువాత ఆమెకు ఒకసంవత్సరము కు విధింపబడెను.

### ౧౫ యేండ్ల ప్రాయపు సత్యాగ్రహి

మధ్యరాష్ట్రములో ౧౫ యేండ్ల ప్రాయంగల సత్యాగ్రహి శ్రీ మోతీలాలు త్రిపాఠి అనువానికి బిలాస్పూరులో మూడేండ్ల కఠినశిక్ష విధింపబడెను.

### జిల్లా కాంగ్రెసు కార్యాలయం సోదాచేయబడుట

మొదటిక్లాసు మేజిస్ట్రేటు ఒకపోలీసుపార్టీ కలిసి ఏప్రిలు౧౨వతేది కాంగ్రెసుఅధ్యక్షుని యిల్లును, కాంగ్రెసు భవనమును సోదాచేసిరనియు కాంగ్రెసుకార్యాలయమునుండికొని మైక్రోఫోన్లుయిఉయుత్రిం యితరకాగితాలు తీసికొనిపోయిరనియు తరువాత పోలీసులు ఒక ముద్రణాలయము కూడా సోదాచేసిరనియు రాయపూరునుండి వార్త తెలుపుచున్నది.

### వార్ధాతాలూకా కాంగ్రెసుకమిటీ రద్దు

వార్ధాతాలూకా కాంగ్రెసుకమిటీఅఖిలభారత కాంగ్రెసుకమిటీ ఉత్తరువు ప్రకారం రద్దుచేయబడెను. ఆప్రాంతమున శ్రీబాబాజీ మోఘేగారు సత్యాగ్రహనియంతగా నియమింపబడిరి.

### అలహాబాదు సత్యాగ్రహనియంతకు శిక్ష

గతమాసం దేశరక్షణనిబంధనలక్రింద అరెస్టు చేయబడిన అలహాబాదుజిల్లా సత్యాగ్రహుల నియంత శ్రీప్రసిద్ధ నారాయణ్ ఆనంద్ గారికి ౧౮నెలలకఠినశిక్ష, రూ౨౦౦ జుర్మానా, ప్రత్యామ్నాయంగా మరి౩నెలలశిక్ష విధింపబడెను.

### అలోమ్రాజిల్లా మొదటి స్త్రీసత్యాగ్రహిని వదలివేయుట

అలోమ్రాజిల్లా ప్రథమ స్త్రీసత్యాగ్రహి శ్రీమతి హీరాలీదేవిగారిని అలోమ్రానగర మేజిస్ట్రేటు ఏప్రిలు౧౨వతేది దేశరక్షణనిబంధనలక్రింద నేరం విషయమై నిర్దోషురాలనివదలివేసిరి. యుద్ధవ్యతిరేకశేకలుకేకినట్లు శ్రీమతి హీరాలీదేవిఅంగీకరించెను. కాని కోర్టువారు అపవాదకు అర్థంఅడుగగా దానిఅర్థం తెలియదనిన్ని యేవాక్యాలు అరచినదీకూగా జ్ఞప్తి లేదనిన్ని ఆమెచెప్పెను.

యుద్ధవ్యతిరేకవాక్యాల అర్థంతెలుపలేకుండున మరియుద్దరు సత్యాగ్రహులనుకూడా ఆమేజిస్ట్రేటు వదలివేసెను.

### అలోమ్రా నియంత అరెస్టు

ఏప్రిలు౧౨వతేదిన అలోమ్రాజిల్లా సత్యాగ్రహ కమిటీనియంత శ్రీసతీష్‌చంద్రపంత్ గారిని వారి భోజనపుంబారిని స్వగృహమందు దేశరక్షణనిబంధనలక్రింద అరెస్టుచేయబడిరి

లాహోరులో, ఏప్రిలు౧౨వతేదిన సత్యాగ్రహం చేసిన శ్రీమతిలజావతి, శ్రీమతిశాంతిదేవి అను యిద్దరుస్త్రీలకు స్థానిక మేజిస్ట్రేటు చెరి ౬ నెలల శిక్షవిధించెను.

### మేజిస్ట్రేటు ఆజ్ఞోల్లంఘనమునకై అరెస్టు

సత్యాగ్రహులను చేర్చుకొనరాదని మొనమ జిల్లామేజిస్ట్రేటు ఉత్తరువు నుల్లంఘించినందుకు రావల్పిండిలో సత్యాగ్రహనియంత శ్రీచాదిరీ ఖిజ్ఞాన్ భాటియాగారు నాటినాటిరాత్రి దేశరక్షణనిబంధనలక్రింద అరెస్టుచేయబడెను.

### రెడ్ షర్టు సత్యాగ్రహులను అరెస్టు చేయలేదు

పెషావరులో ఏప్రిలు ౧౦వతేదిలో రెడ్ షర్టు సత్యాగ్రహులుసత్యాగ్రహం మొదలుపెట్టి పక్షం రోజులు పూర్తిఅయినది ఎవరినిఅరెస్టుచేయలేదు.

దేశాభ్యుదయమునకై గాంధీగారు దానిపరిష్కారమునకు ఏప్రిలు౧౨వతేది క్రొత్తఢిల్లీ మందిరమున డా౹౹ రాజేంద్రప్రసాద్ గారు కాంగ్రెసు నాదుల సభలో ఉపన్యసిస్తూ గాంధీగారి మరతులు తృప్తి పరచునట్టివ్యక్తులు అధిక సంఖ్యాకులుగా సత్యాగ్రహంచేయుటకు ,వస్తున్నారనియు, గాంధీగారి మరతులు రోజురోజుకు కఠినతరమగుచున్నవనియు చెప్పిరి.

### ఢిల్లీ పత్రికాప్రముఖుని అరెస్టు

ఢిల్లీపత్రికాప్రముఖుడు శ్రీ యల్, బ్రిజ్‌లాల్ గుప్తాగారు మోటబజారుఎదురుగా చాంద్నీచౌకులో సత్యాగ్రహంచేసినందుకు ఏప్రిలు ౧౧వతేది సాయంత్రం అరెస్టుచేయబడిరి.

### అలోమ్రాజిల్లాలో ౫౩మంది శిక్షింపబడుట

ఏప్రిలు౧౧వతేదిన అలోమ్రాజిల్లా హాలిపట్ డివిజనులో ౫౩మంది దేశరక్షణ నిబంధనలక్రింద శిక్షింపబడిరి వారిలో కోర్టు ముగిసేవరకు శిక్షయు రూ౫౦నుండి౩౦౦వరకు జుర్మానాలువిధింపబడిన ౩౫మందిరాజకీయ వర్ డివిజనలు అధికసరచే విడుదలచేయబడిరి. వారికివిధింపబడిన జుర్మానాలను ౧౫రోజులలోగాచెల్లించవలెననని మేజిస్ట్రేటు వారినికోరెను,

### సంయుక్తరాష్ట్రంలో అరెస్టులు

సంయుక్తరాష్ట్రమున వారాంతమున యిరువదిమంది అరెస్టుఅయిరి. ఉనావు కాంగ్రెసుకమిటీ అధ్యక్షుడు మునిసిపలుబోర్డు ఉపాధ్యక్షుడు హాజిఅబ్దుర్ రహమాన్ అన్సారీగారు, బస్తీలో రాష్ట్ర కాంగ్రెసుసభ్యుడు రాయిశైవనారాయణ్ శ్రీవాస్తవాగారు, పాటనార్పూరుపట్టి కాంగ్రెసు కార్యదర్శి శ్రీశివలాలఅగర్వాలాగారు,

### ఆంధ్రరాష్ట్రం

ఆంధ్రదేశంలో అనంతపురం జిల్లాలో జరిగినవిగాని అరెస్టులులేవు.

కృష్ణాజిల్లాలోకూడ సత్యాగ్రహులను అరెస్టు చేయలేదు.

### స్త్రీలపై న్యూసెన్సు కేసులు

ఏప్రిలు ౫వతేదిన మదరాసురహదారిచట్టము క్రింద విజయనగరంలో శ్రీమతులు అంపలాం హేమవతీదేవి, ద్వారకా భమిడిపాటి మహాలక్ష్మమ్మగార్లు శ్రీ అంపలాం సింహాచలంగార్లపై న్యూసెన్సు కేసు పోలీసువారు పెట్టియుండిరి.

సబఇన్స్పెక్టరుగారు రహదారికి అంతరాయము కలుగుటచేతను యుద్ధ ప్రతికూల వాక్యములు పలుకుటచేతను అరెస్టుచేసితిననిరి.

సత్యాగ్రహులతరపున శ్రీ ఉదయగిరి సీతారామస్వామిగారు వాదించుచు, మహాదేవుల రహదారికి అటంకముకలగచేయక, ఒకమూలగా ఉండి యుద్ధప్రతికూల వాక్యములు ఉచ్చరించుటచే దేశరక్షణ చట్టముక్రింద కేసు విచారణచెయ్యవలెగాని, న్యూసెన్సు చట్టముక్రింద రాదని చెప్పిరి.

మేజిస్ట్రేటుగారు ౨౦వతేదీకి రికార్డుచేసి ౨౩వతేదికి వాయిదావేసిరి.

### కోర్టులోనసత్యాగ్రహము

ఏప్రిలు౭వతేదిన పామిడిగ్రామములో సత్యాగ్రహముచేసి అరెస్టుకాని గొంగడిపెద్దతిప్పయ్య అను ౧౯ఏండ్ల యువకసత్యాగ్రహి ౯వతేదిన గుత్తిగ్రామములో బజారువీధులలోను యితరవీధులందును తిరిగి యుద్ధవ్యతిరేకపు కేకలు ఉచ్చరించెను తర్వాత గుత్తిమునసబుకోర్టు గుత్తిడివిజనలు మేజిస్ట్రేటుకోర్టు కాంపౌండు చేరినను మేజిస్ట్రేటు కోర్టువుండే ప్రదేశములో జిల్లి ప్రజలు వినునట్లు బిగ్గరగా యుద్ధ వ్యతిరేకపుకేకలువేయగా, సబ మేజిస్ట్రేటుకోర్టులో విచారణజరిపి న్యూసెన్సుఆక్టుక్రింద వారముకోజులు కఠినశిక్షవిధించినారు.

---

## బ్రిటనుకు అమెరికా సహాయముచేయుట

ఉత్తర అమెరికానుండియు, దక్షిణా అమెరికానుండియు యుద్ధావసరసామగ్రితో నిండియున్న విమానములు ఉంచబడిన ఓడలుకొన్ని ఇటీవలనే బ్రిటిషురేవుకు చేరినవి. వాటితోడుగా బ్రిటిషు డిస్ట్రాయరు నౌకలువచ్చినవి.

దక్షిణఅట్లాంటిక్కు సముద్రంలోఒకబ్రిటిషు నౌకజర్మనురైయిడరు చే ముంచి వేయబడినది,

---

## కొచ్చిన్ మహారాజుగారి నిర్యాణము

కొచ్చిన్ మహారాజుగారు శ్రీ రామవర్మ గారు ఏప్రిలు౧౩వతేదిన చొకరాలో రాత్రి ౧౧౹౹గంటలకు మరణించిరి. ప్రభుత్వ కార్యాలయములు, దుకాణములు ౧౩వతేది యంతయు మూయబడియుండెను. మరణించునప్పటికి వారికి ౮౦సంవత్సరముల వయస్సు. వారు ఉబ్బసంవ్యాధి వలన మరణించిరి కొంతకాలముక్రిందట మంచముపట్టి యుండిరి.

---

# బ్రిటనుపై జర్మనువిమానాల దాడులు మరల తీవ్రించుట

## జర్మనీపై బ్రిటిషు విమానాలదాడులు తీవ్రముగానేయుండుట

ఏప్రిలు ౧౦వ తేదినుండి ౧౧వ తేదివరకు వచ్చిన వార్తలవల్ల బ్రిటనుపై జర్మనువిమానాల దాడులు మరల తీవ్రములైనట్లుకనపడుచున్నది. ఈసారి బ్రిటిషుసామ్రాజ్యములో చేరియుండు ఉత్తరఐర్లండునుకూడ జర్మనువిమానాలదాడులుబాధించినవి.

ఏప్రిలు ౭వ రాత్రిఅంతనునుండి స్కాట్లెండు వరకు జర్మనువిమానాలుపైన ఎగిరిబాంబులనువేసినవి. ఇదేసమయంలో ఉత్తరఐర్లండుపై జారవిడిచిన బాంబులచే అక్కడిపారిశ్రామిక కార్యాలయాలకును, వ్యాపారస్థలాలకును, ఇతరసొత్తుకును కొంతనష్టముకలిగెను. బ్రిటిషువిమానాలు అక్కడికి వచ్చినజర్మనువిమానాలలోనుండి ఒకదానిని క్రిందికికూల్చినవి. బ్రిటనులోస్కాట్లెండు ఈశాన్యము తూర్పు, ఆగ్నేయము, పడమర, మధ్య భాగములలోను, ఇంగ్లాండుఈశాన్య సముద్రతీరమందలి ఒకపట్టణములోను, పడమటిమిడ్లెండ్సులోని ఒకపట్టణములోను, తూరుపుఆంగ్లియాలోని ఒకపట్టణములోను జర్మనుబాంబులుపడెను. దాడులవలనగినంతనష్టములేదు. మొత్తముమీద ఈ రాత్రి జర్మనువిమానాలను బ్రిటిషువారుక్రిందకూల్చిరి. ఆ దినములో ఒకముసలివారల ఆస్పత్రియందు బాంబులుపడి, అక్కడిరోగులలోనొకడు మరణించెను ఇద్దరికిప్రమాదకరమైన గాయాలయ్యెను. స్కాట్లెండులో ఆ కేకులుమరణించిరి.

ఏప్రిలు ౯వ తేది పగలుఇంగ్లీషు ఛానలుమీద జర్మనువిమానాలను బ్రిటిషువారుక్రిందికూల్చిరి మధ్యాహ్నమువేళ ఈస్టిఆంగ్లియా సముద్రతీరంలో కొన్నిబాంబులను జర్మనువిమానాలనుండివదలిరి, ఈనాటిరాత్రిపడమటిమిడ్లెండ్సులోని ఒక పట్టణమందు చాలాఘోరమైననష్టముజరిగెను, ఆ కేకులుగాయపడిరి, దక్షిణసముద్రతీర ప్రాంతంలో బాంబులుపడికొందరుమరణించిరి, కొంతసొత్తునష్టమయ్యెను. ఈరాత్రిమొత్తముమీద జర్మను విమానములు బ్రిటిషువారిచేక్రింద కూల్చబడినవి ఇంకనుఆ కేములు పాడైనవి,

ఏప్రిలు ౧౦వ తేది పగలుబ్రిటిషు యుద్ధనావలనుండి ప్రేల్చినతుపాకులగుండ్లచే రెండుజర్మనువిమానాలుక్రిందికికూలినవి. బ్రిటిషుఓడకుఎట్టిదెబ్బ యుంతగులలేదు బ్రిటనుపైఈపగలు జర్మనువిమానాల దాడులులేకుండెను ఈనాటిరాత్రిమరలపడమటి మిడ్లెండ్సులోని ఒకపట్టణముపై ఘోరముగా జర్మనుబాంబులువరుసగాకొన్ని గంటలవరకు వేయబడినవి, జర్మనువిమానములు బ్రిటిషువారిచే క్రిందికికూల్చబడినవి మిడ్లెండ్సులోనిపట్టణంలో అనేకప్రాణములును, ఆస్తియునష్టమైనది. బర్మింగుహాంలో బ్రిటిషుఆయుధ నిర్మాణశాలల మీదను, న్యూకాజిల్లోనిజాకలమీదను బాంబులుపడి చాలనష్టమయ్యెను.

ఏప్రిలు ౧౧వ తేదిపగలు జర్మనువిమానాలు డోవరు జలసంధిమీదను: ఇంగ్లీషుఛానల్మీద సంచరించినవి, కొన్ని బ్రిటనులోనికి కూడపోయినవి మధ్యాహ్నము రెండుజర్మనువిమానాలు బ్రిటిషువారిచే నాశనముచేయబడినవి రాత్రివేళ దాడిచేయుటకువచ్చిన జర్మనువిమానాల సంఖ్యచాలహెచ్చుగానుండెను, ఇంగ్లాండు దక్షిణభాగం మీదను, పడమటిమిడ్లెండ్సుమీదనుదాడి తీవ్రముగానుండిచాలనష్టముకలిగించెను తూర్పుఇంగ్లాండులోనుదక్షిణసముద్రతీరమందును కూడదాడులుతీవ్రములుగనుండెను. మొత్తము ౧౦ జర్మనువిమానాలుక్రిందికికూల్చబడినవి.

ఇక జర్మనీపై బ్రిటిషువిమానాల దాడులసంగతిమాటేదను, ఏప్రిలు౭వ తేదిపగలు ఫ్రాన్సు వాయవ్యసముద్రతీరమున కెదురుగా మూడు జర్మను డిస్ట్రాయరునౌకలుకనిపించగా బ్రిటిషు సముద్రతీరరక్షకవైమానికుడొకడు ఒకజర్మనుఓడపై బాంబులనువేసెను. ఆఓడ మునిగిపోయియుండునునుచున్నారు. మరియొకజర్మనునౌక చెడిపోయినది. ఈనాటిరాత్రి హాలెండులో ఇనుప కర్మాగారములమీదను, జర్మనుసేనలమీదను, విమానాశ్రయాలమీదను, మోటారుబండ్లమీదను, బ్రెస్టులో నౌకాశ్రయముమీదను. బాంబులువేయబడినవి, ఒక జర్మనువిమానమును బ్రిటిషువా రెవరోక్కని నేలకుకూల్చిరి. బ్రిటిషువారవి 3విమానాలు ఈలోపు తిరిగిరమింపలేదు.

ఏప్రిలు౮వ తేదిరాత్రి బ్రిటిషువిమానాలు జర్మను ఓడరేవులలో ముఖ్యమైన కీలుపట్టణంమీదను బ్రెమెన్హేవన్, యుండెన్ పట్టణాలమీదను తీవ్రముగాదాడిచేసినవి. అట్టి బ్రిటిషువిమానాలనుండి నాలుగు తిరిగిరావింపనలేదు. పగలుడెన్మార్కు, హాలెండు, బెల్జియంమీద బ్రిటిషువిమానాలు బాంబులువేసినవి. ఉత్తరసముద్రంలో ఓడలమీదను ష్కిర్చ్వరుడాకులమీదను, ఉత్తరఫ్రాన్సులో విమానాశ్రయాలమీదను బాంబులుపడినవి. ఈపగటిదాడులనుండి ఒకబ్రిటిషువిమానం తిరిగి రాలేదు. ఈనాటిరాత్రి దాడికైపోయినన్ని బ్రిటిషువిమానా లిదివరకెన్నడుగాని పోయియుండలేదు-కీలువద్ద ఒక చదరపు మైలుప్రదేశమంతయు అగ్నిజ్వాలలమయమైయుండెను.

౯వ తేదిపగలు ఫ్రీజియన్ దీవివద్ద సముద్రంలో జర్మనుఓడలపైనను, ఫ్రాన్సు హాలెండు, డెన్మార్కు, బెల్జియములమీదను బ్రిటిషు విమానాలు బాంబులువేసినవి, రాత్రివేళమరలకీలుపై ఘోరముగా బాంబులువేయబడినవి ఈదాడినుండి ఆయిదుబ్రిటిషువిమానాలు తిరిగిరాలేదు.

ఏప్రిలు౧౦వ తేదిపగలు బ్రెస్టువద్ద జర్మనునౌకలమీదను డెన్మార్కులో రైలుబండ్లమీదను ఒకపవర్స్టేషనుమీదను, దక్షిణనార్వేలో అల్యూమినియంకర్మాగారాలమీదను బాంబులువేయబడెను. రాత్రి బెర్లినుపై మూడుగంటలదాడి జరిగెను. చాలవిపరీతమైననష్టముకలిగెను. రెండుమూడు వేలమందికి బాంబులు తగిలియుండును-జర్మనీ వాయువ్యభాగంలోని యుండెను మున్నగు ప్రదేశాలపైగూడ బాంబులువేయబడినవి ఈదాడులనుండి ౫బ్రిటిషువిమానాలు తిరిగిరాలేదు.

ఇటీవలకొన్ని నెలలనుండి బ్రిటిషువిమానాలు జర్మనుఅస్థలాలపైతిరిగి, వేసినబాంబులచే బ్రైమెన్లో ఓడలనిర్మాణశాల లనేకములు కాలిపోయినట్లును, ఒకవిమాననిర్మాణ యంత్రశాలయు, డెష్నోగులో ఒడల నిర్మాణశాలయు: విల్హెంస్హేవన్లో ౧నేకములైన యంత్రసిరంగుపాపులును నాశనమైనవి. నౌకలనిర్మాణ సంబంధములైనపనులు ఇకమీద కొంతకాలమువరకు సాగకుండవలయినది.

---

# రష్యా యుగోస్లేవియాల ఒడంబడిక

## జర్మనీవిస్మయము

ప్రస్తుతపరిస్థితులలో రష్యాయుగోస్లేవియాలు చేసికొన్న ఒడంబడికజర్మనీలోవిస్మయము కలిగించినదని స్వీడనుపత్రికకు జర్మనీనుండిఒకవిలేఖరి వ్రాసెను. అమెరికాసంయుక్తరాజ్యాల విదేశాంగమంత్రియగు కార్డెల్హాలుగారు "ఈఒడంబడిక చాల ప్రోత్సాహకరముగా నున్నది. ప్రపంచాధిపత్య సంపాదనకే హిట్లరు ఉద్దేశ్యమని రష్యాగ్రహించినది" అనిచెప్పిరి. జర్మనీరష్యాలు కలసి బాల్కనుదేశములనుపంచుకొనునను భయము ఈఒడంబడికవల్ల తీరినదనిటర్కీ సంతోషపడుచున్నది.

---

# నిజాంరాష్ట్రద్వితీయ చేనేత పారిశ్రామిక సభ

## చేనేతపరిశ్రమ బాధకములనుగూర్చితీర్మానాలు

మానుకోట, ఏప్రిల్ ౧౩

ది. వి. ౯-౩-౧౩౫౦ ఫసిలి గురువారం ఉదయం ౯గంటలనుండి, ౨గంటలవరకు నల్లగొండజిల్లాలోచేరిన దేవరకొండవాస్తవ్యులనుప్రసిద్ధన్యాయవాదులను. శ్రీమాన్ పగిడిమర్తిమల్లయ్య హైకోర్టువకీలుగారి అధ్యక్షతతో సభసమావేశముగావింపబడెను, ఆహ్వానసంఘాధ్యక్షులు తమఉపన్యాసానంతరము. అధ్యక్షులవారుప్రతినిధుల కరతాళధ్వనులచే అధ్యక్షపీఠమలంకరించిరి.అధ్యక్షులవారు తమగంభీరోపన్యాసము చేనేతవారలకు కలుగుచున్న కష్టనిష్ఠూరములను గురించి తెలుపుచు తమఉపన్యాసమొసంగిరి. కొందరి నాయకులఉపన్యాసములుజరిగెను తదనంతరము, ప్రభుత్వమునుగూర్చి కొన్నితీర్మానములు గావింపబడెను.

యుద్ధమువలనచేనేతమగ్గములకు గావలసినసూలు, రంగులుచాల హెచ్చుటచేతను ఈహెచ్చునకుతగినంతవెల నేసినబట్టలకు పెరగనికారణముచేతను, చేనేతపారిశ్రామికులకు చెందవలసినకూలి పూర్తిగతగినదివాడినసూలు, రంగులు. చేనేతపారిశ్రామికులకు నష్టమురానివిధమునవిక్రయించుటకుల ప్రభుత్వమువారు ఏర్పాటు గావింపవలయును.

చేతిమగ్గములపోటీని తగ్గించుటకుగాను మిల్లుగుడ్డమీద, పన్నువేసి, వసూలగుధనమును చేతిమగ్గముల అభివృద్ధికివినియోగింపవలయును.

ప్రభుత్వపునేతపారిశ్రామిక శాఖవారిచే నీయబడుచున్నవిద్యార్థి వేతనములను ఏతత్ శాఖకుసంబంధించినఉద్యోగములను నేతపనియేవంశపరంపరగానవలంబించుచున్నవారికే యీయవలయును.

చేనేత పరిశ్రమాభివృద్ధికై ప్రభుత్వమువారు కొన్నిజిల్లాలలోనే చేనేతశాఖలు నేర్పరచియున్నారు. మిగతజిల్లాలలోగూడ వెంటనే శాఖలనేర్పరచవలయును.

కొన్నిప్రత్యేక నడకునూలుశాఖల యేర్పాటుకై ప్రభుత్వమువారు పదివేలరూపాయిల నొసంగినందులకు ఈసభవారు కృతజ్ఞత తెలుపుచు, ఈ పరిశ్రమాభివృద్ధికై కనీసము పదిలక్షల రూపాయిలైన ఖర్చుపెట్టినగాని పనిలేని బీదకుటుంబములకు పోషణజరుగజాలదని కోరుచున్నారు,

చేనేత పారిశ్రామికులకు కావలసిన యితరరాష్ట్రములనుండివచ్చురాటమునూలు, గిర్నినూలుమీద ప్రభుత్వమువారు విధించుచున్న సుంకములవలన చాల నష్టముకలుగుచున్నది గనుక ప్రభుత్వమువారు యీపన్ను వెంటనే తీసివేయవలెను

నిజాంరాష్ట్రమునగల ఆయిదులక్షల చేనేతపారిశ్రామికులును గలసి రెండు లక్షలకు పైగాను చేనేతమగ్గములమీద సంవత్సరము నొకటింటికి మూడుకోట్ల రూపాయిలకుపైగా ఖరీదుగల వస్త్రములను నేయుచున్నారు. ఈ పరిశ్రమరాష్ట్రమునగల వ్యవసాయమునకు తరవాతరెండవదిగానున్న పరిశ్రమ. ఇట్టిపరిశ్రమ రక్షణార్థమై శాసనసభలో కనీసము రెండుస్థానముల నివ్వవలెను.

ప్రభుత్వమువారి సైన్యములను సివిల్శాఖలలోను, పోలీసుశాఖలలోను, రైల్వేశాఖలలోను, జెయిల్ఖానాలలోను, మునిసిపాలిటీలలోను, అడవిశాఖలలోను గావలసిన వస్త్రములను చేనేతవస్త్రములనే వాడవలయును.

ఇండియాప్రభుత్వమువారు ప్రస్తుతము జరిగించుచున్న చేనేతవిచారణ సంఘముయొక్క కార్యక్రమమును ఈసభవారు అభినందించుచున్నారు. చేనేతపారిశ్రామికుల రక్షణకొరకము వీరుతయారుచేయు అన్నిరకముల వస్త్రములను, వీరు నేయగలిగినన్ని గజములను ప్రత్యేకరక్షణయొసంగవలెను ఈవిధముగా రక్షణ యేర్పడినగాని సంపూర్ణదీనస్థితిలోనున్న యీపరిశ్రమ అభివృద్ధిచెందజాలదు.

ఈతీర్మానమును యిండియాప్రభుత్వమువారికి పంపవలెనని నిజాంప్రభుత్వమువారిని ఈసభవారు కోరుచున్నారు.

నిజాంరాష్ట్ర చేనేతపారిశ్రామిక సంఘనియమావళిని సిద్ధపరుపవలసినదిగా కార్యనిర్వాహకవర్గమువారికిఈసభవారుఅధికారమిచ్చుచున్నారు.

ఈ క్రిందికార్యవర్గము ఎన్నుకొనబడినది :-

అధ్యక్షుడు శ్రీ పగిడిమర్తిమల్లయ్య హైకోర్టువకీలుగారు ఉపాధ్యక్షుడు శ్రీ ౦ం క్రిష్ణమూర్తి గారు. కార్యదర్శి శ్రీ పగిడిమర్తి యల్లయ్యగారు. సహాయకార్యదర్శులు శ్రీ హాలింపుల్నారాములు, శ్రీ అప్పంవీరన్న గార్లు(నూర్యాపేట) వీరు గాక గుంటక నరసయ్యపంతులుగారు మున్నగు ౧౩మంది సభ్యులుగలరు.

---

## మానుకోటతాలుక పద్మశాలి మహాసభ

మానుకోటతాలూకా పద్మశాలిమహాసభ సాయంత్రం 3గంటలనుండి 8గంటలవరకు సుధాకరరావుగారి అధ్యక్షతలో శ్రీమాన్ డాక్టరు పూర్ణవీరయ్యగారి అధ్యక్షతతో మానుకోటలో జరిగెను. వరంగల్ వేదవిద్యార్థులు దైవప్రార్థన జరిపినతరువాత ఆహ్వానసంఘాధ్యక్షులవారి ఉపన్యాసానంతరము అధ్యక్షులవారిని పుష్పమాలాంకృతులను గావించిరి, తమ ఉపన్యాసమును చదివి వినిపించిరి. సంవత్సరనివేదిక కార్యదర్శియగు. శ్రీమాన్ మిట్టకోలనర్సయ్యగారు చదివిరి. తదుపరి కొందరి నాయకుల ఉపన్యాసములు జరిగెను. ఉపన్యాసములలో ముఖ్యులు బ్రహ్మశ్రీమాణిక్యశాస్త్రిగారు శ్రీవారి ఉపన్యాసము సభికులమనరంజింపచేసెను. మధ్యపానవిరోధక తీర్మానము లేరపునండి. శ్రీమాణిక్యరావుగారు, శ్రీపనంశ్రేష్టమూర్తిగారు, శ్రీపండిమల్లిమల్లయ్యహైకోర్టు వకీల్ గారును శ్రీమాన్ కటిపాపయ్యగారు వరంగల్ వేదవిద్యార్థియగు, శ్రీచిన్నంకటేశయ్యమొదలగువారు ఉపన్యసించిరి.

---

## ఆంధ్రగ్రంథాలయము

చేర్యాల, ౫-౪-౪౧.

మాగ్రామము జనగాము తాలూకాలో చేరినది. ఇచ్చట స్థానికపౌరుల సహాయముచే ఆంధ్రగ్రంథాలయమను పేరుచే భాషానిలయము స్థాపించి నడుపబడుచున్నది. ఇప్పుడు నిలయములో 3౧౫ పుస్తకములు సమకూర్చబడినవి.

---

## మానుకోట తాలూకా పద్మశాలియువకసభ

చైత్ర శు॥ ౧౩ గురువారం సాయంత్రము ౭ గంటలనుండి ౧౦ గంటలవరకు యువక నాయకులగు శ్రీమాన్ శ్రీరాం నరసయ్యగారి అధ్యక్షతతో పైసభమానుకోటలో సమావేశముజరిగెను.

ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీమాన్ యలగం సత్తయ్యగారు తమ ఉపన్యాసానంతరము అధ్యక్షులవారు సభికులకరతాళధ్వనులచే అధ్యక్షపీఠము అంకరించిరి వరంగల్ వేదవిద్యార్థి సంఘమువారి చేప్రార్థనలుజరిగినతరువాత అధ్యక్షులు తమ ఉపన్యాసముచదివిరి సంఘోన్నతికవసరమగు ౧౬ తీర్మానములుగావించబడినవి, తీర్మానములుజరిగిన తరువాత కొందరియువకుల ఉపన్యాసములు గావింపబడెను కార్యదర్శిగారు సభ్యులకు కృతజ్ఞతాభివందనములర్పించుచు సభముగింపబడెను.

---

## అ.భా. తె. మున్నూరువారి స్థాయిసంఘసభ్యుల ఎన్నిక

హైదరాబాదు (దక్కను). వృషనామసంవత్సర చైత్రబ॥౫ సోమవారము ఖుర్దాదుగం 1లేది సాయంకాలము ౫ గంటలకు శ్రీ రాజప్రతాపగీర్జి కోఠియందున అఖిలభారతతెలుగు మున్నూరువారి స్థాయిసంఘసభ్యులఎన్నికలుజర్గును. మరియు నివేదికచదువబడును. కావున హైదరాబాదు. సికింద్రాబాదు బొల్లారం కుల సోదరులందరు దయచేసి పైఎన్నికలలో పాల్గొనదరని ప్రార్థన-

---





## ఆదిహిందు సమాధాన సభ

అయ్యా,

ఈమధ్య ఆదిహిందువులలో విభేదములు తొలగించుటకై దేశములో స్థాపించిన సమాధానసభకు నేను చిరుపనున్న రాజీనామా పెట్టినందున స్వజాతీయులకు తెలియజేయుచున్నాను.

గా॥ ప్రతినిధికమిటీగారికి:—

అయ్యా,

యువకులచేత పిలువబడినసభలో ప్రవేశపెట్టి నతీర్మానమునకు భంగముకలిగే విషయములు పైకమిటీలో చర్చింపబడినందువలన, మరియు స్వజాతీయుల సమాధానపర్చుటకు మారుగా పైకమిటీ కొకనూతనసంఘమును ఏర్పాటుచేసిన అభిప్రాయభేదములు తొలగగలవని యత్నించుచున్నందునను, జాతీయులలో సమాధానపర్చుటకు బదులు పైకమిటీ యింకపార్టీలు పెంచుటకుపాయ చూపుచున్నందున, పైకమిటీలో నేనుండదలగదు. యువకులతీర్మానమును నెరవేర్చుటకు శాశ్వతిగా లది యత్నించినను వేరేవిషయమునకు పైకమిటీ మారుచున్నదిగాన పైకమిటీలో నేనుండను.

ఇట్లు

జాతీయుల సమాధాన శ్రేయాభిలాషి,

పులి మల్లికార్జున్.

---

## శ్రీ పద్మశాలి యువజన సంఘం

సదాశివపేట ౧౦-౪-౪౧

నేడు శ్రీ సంగమేశ్వరాలయములో శ్రీయుత బచ్చువెంకటేశంగుప్త వకీలుగారి అధిపత్యమున సభ మహావైభవముగా జరిగినది. శ్రీయుతులు పీఠమధిష్ఠించినతోడనే, పద్మశాలి యువకులందు ఐకమత్యము లేదనియు, ఐకమత్యములేకనే ఈసంఘమునకు యిన్ని విఘ్నములు జరుగుచున్నవనియు, ముఖ్యముగా ప్రతి పద్మశాలి యువకుడు, సంఘమభివృద్ధిలోనికి తెచ్చుటకు ప్రయత్నపడియుండవలయుననియు చెప్పుచు, గత సంవత్సరమున పద్మశాలీయులకు శ్రీ నైజాంగారు చేయదలచిన ఆరువేలరూప్యములసహాయము వీరికి సంబంధించిన సంఘమేదియు లేనందుననే ఆపబడినదనియు చెప్పిరి. మాపై యింతటి యనురాగమును వహించి యిట్టి యమూల్యవిషయమును తెలిపినందులకై శ్రీయుత బచ్చు వెంకటేశంగుప్త వకీలుగారి సంఘపక్షమునుండి మిక్కిలి ధన్యవాదము అర్పించుచున్నాము.

---

బహాదర్ యార్ జంగ్ గారి రాక.

ఒకరోజున యిక్కడ ఉదయం పదిఘంటలకు బహద్దరుయార్జంగు గారు వేంచేసిరి. సుమారు యాభైమంది ముసల్మానులు స్వాగత మొసంగిరి. వారు మసీదులోనికి రాగానే నూర్లకొలది ముసల్మానులుండిరి, మసీదులో మధ్యాహ్నం ఆరు చి వ్యాఖ్యానంబు గావించిరి. వెంట నేమజలిసీఇత్తెహాదుల్ ముసల్మీన్ యను మజలీసును ఏర్పాటు చేసిరి. పొయ్యేటప్పుడు మోటరుకారులో కూర్చుండు సమయములో శ్రీవకీలు వెంకటేశం గారు రామను దిరములోనికి రమ్మని యడిగిరి వందనప్రియములాచరించిరి అందుకు వారు సమ్మతించక పెద్దఎత్తైలికి వెళ్లిపోయిరి

---

# తల్లిగారిమరణము-ప్రభువుగారి ఫర్మాను

హైదరాబాదు ఏప్రిలు ౧౫

మ-ఘ-వ నిజాంప్రభువుగారితల్లిగారిపేరు హజ్రత బాదీ బేగం సాహెబా గారు. వారుగనపోవునప్పటికి ౭౦ ఏండ్లవయసువారు వారిశవాన్ని పురానా హవేలీనుండి నిజాందేవిడీసమీపములోనున్న జవ్వాద్ మసీదువరకు తీసుకొనివెళ్ళిరి. సుమారు మూడుమైళ్ళవరకు నిజాంప్రభువుగారును మంత్రివర్గమువారును అధికారులును పౌరుల్యులును నగరపౌరులునుచాలామందియు పాదచారులై వెళ్లిరి గౌ॥ రెసిడెంటు గారిపక్షాన ఎగర్టన్ గారుఊరేగింపులో పాల్గొనిరి. మ-ఘ-వ-నిజాంప్రభువు గారు తమతల్లి గారిమరణాన్ని గురించి యీ క్రిందివిధముగా ఫర్మానును ప్రకాశమానంచేసినారు.

"నాపూజనీయురాలైనమాతయగు ఉమ్మతుల్ జహ్రా బేగంగారిమరణమునుగూర్చి అధికమైన వ్యసనముతో ప్రకటనగావించుచున్నాను. ఆమెకు సుమారు ౭౦ ఏండ్లుండెను. రెండుమాసాలుజాడ్యముతో పడియుండిరి, ఇట్టివారునిజముగా దేవునినుండివచ్చెదరు. దేవునివద్ద కేపోవుదురు" గతసంవత్సరంకూడ ఆమెకుచాలాజబ్బుకలిగెను. కాని ఆమెవయస్సుపరిమాణముకన్న ఎక్కువ మిగిలియున్నందున ఆమెబ్రతుకగలిగెను. కాని అప్పటినుండియు ఆమెఆరోగ్యంబాగాలేకుండెను. గతసంవత్సరంఆమెకు న్యూమోనియాజ్వరంవచ్చెను ఈసంవత్సరం ఈమెకు తెగకుండా జ్వరంవస్తూవుండెను. జలుబువిశేషమయ్యెను. తుదకు సోమవారం ౧౪ రబ్బిలవ్వల్ నాడు రాత్రి ౧-౩౦. గంటలకు ఆమె ప్రాణాలనువదిలెను. ఆమెచావు బహుసుఖముగా ఎవ్వరికినికష్టపడనిరీతిగాసంభవించెను పుట్టినవారికంతా ఒకనాడుగిట్టేదితప్పదు. రెండుతరాలనుండి ఇద్దరిప్రభువులకాలములో ఆమెకలిసేభాగ్యాలుకలిగియుండెను. ఇకఒకకోరికఆమెకుండెను తనకొడుకుబ్రతికియుండగా యెట్టితనసేవ చేసెనో అట్లేతనతుదికర్మలుకూడా కొడుకేచేయవలెనుఅనునది. అదికూడా దైవానుగ్రహంవలన తుదిముట్టెను. దైవవిధిఇట్లుండినను మావిశ్వాసాలప్రకారం త ల్లి కొ డు కు ల ఆధ్యాత్మికసంబంధము విచ్ఛేదము కాదు నాతల్లిప్రేమను తలచుకొనుచు నాజీవితశేషమును సుఖముగాగడుపగలను. ఒక్కదినం కూడ నేను నాతల్లిని మరువజాలను. ఆమె అస్తిత్వము నాకు మహాభాగ్యమని నేనుతలచుచుంటిని. ఆమెయు అట్లే నాయందువర్తించుచువచ్చినది. నా ప్రజలు నాహితచింతకులు ఆమెజాడ్యకాలములోచూపిన తహతహ సానుభూతులను గురించి తుదినాడు శవమువెంట ఊరేగింపులో చూపిన ఆదరమును గురించి నేను గాఢముగా అభినందించుచున్నాను.

ఆమె నా సొంతము తల్లియై యుండినందున నజ్రీబాగు (ప్రభువుగారిదేవిడీ) హద్దువంకు ఒక సంవత్సరకాలపర్యంతరము మళ్లీఆమె సాంవత్సరికంఅయ్యేవరకు ఏదర్బారుకాని నజర్లుఇచ్చుకొనుటకాని దానము,నాట్యము, ఆనందప్రకటన యేదికాని ఉండకూడదు.

తన మనుమడగు బుర్హానుజాహి గోరీవద్దనే ఆమెకును గోరీయేర్పాటుచేయబడినది. ఈజవ్వాదీమసీదు మాకుటుంబము తుది విశ్రామస్థానముగా ఏర్పాటుచేయబడినది.

## బాబెహుకూమత్ వారి సానుభూతి

ప్రభువుగారి తల్లిగారిమరణమునుగురించి బాబెహుకూమతువారీ క్రిందివిధముగా తీర్మానించియున్నారు.

"హజ్రత బాదీబేగంసాహెబాగారి మరణానికి ఈప్రభుత్వమంత్రిసభవారు చాలా విచారమును తెలుపుకొనుచున్నారు. కేవలము మాప్రభువుగారికే తల్లివియోగం కలుగలేదు. ప్రజలందరికిని తల్లివంటివారిల్లిపోయినది. దైవము శ్రీ ప్రభువుగారికి ఓర్పు, ధైర్యముప్రసాదించుకాక. చనిపోయిన బేగంగారిఆత్మకు శాంతినిచ్చుగాక"

# సూయజుకాలువలో అమెరికను నావలు వెళ్లుటకుఅనుమతి

## అజోర్సులో అమెరికా విమానాశ్రయ నిర్మాణము

## రూజ్వెల్టుగారి ప్రకటన

అమెరికా వ్యాపారనావలు సూయజుకెనాలునుపయోగించుకొనుటకు రూజువెల్టు అనుమతిరొసంగినారు మధ్యధరాసముద్రము యుద్ధప్రాంతములోనిదిగదా అందలిరేవును అమెరికానావలు ఉపయోగించుకొనవచ్చునాయని యడుగగా, ఆ సంగతితనకునిశ్చితముగా తెలియదనియు, సూయెజుమధ్యలోనున్న ఇస్మాయిలియా యుద్ధప్రాంతములోనిదికాదని తానునిశ్చితముగా చెప్పగలననియువారుచెప్పిరి అమెరికారేవులలో పట్టుకొనబడిన ౬౯ డేనిష్, జర్మనుయుద్ధనావల రెడ్ సీమీదుగా పంపబడునని అమెరికానౌకావ్యాపారస్థులు తలచుచున్నారు

గల్ఫఆఫ్ఏడెను, రెడ్ సీని అమెరికా నౌకావ్యాపారమునకు ప్రెసిడెంటు రూజువెల్టుతిరిగి తెరిచియున్నాడు, పత్రికాప్రతినిధులసభలో ఈప్రకటనము ప్రెసిడెంటు రూజువెల్టుగావించెను. రెడ్ సీగుండా అమెరికానౌకలు సూయెజుకెనాలుకు వెళ్ళవచ్చునని ఆయనచెప్పెను ఈజిప్టుమతిసిరోనిపోబడవచ్చును. తటస్థరాజ్యమునకు పంపబడిన సరుకులుయుద్ధముచేయుచున్న రాజ్యమునకుచేరవచ్చునాయనువిషయమును అమెరికా ప్రభుత్వమువారు ఆలోచింపరని ఆయనచెప్పెను.

బాల్కనులనుంచియు, లిబియానుండియు వచ్చుచున్న వార్తలు చాలనిరుత్సాహకరములుగానున్నను త్వరలోఅమెరికానౌకలు ఈజిప్టుకు యుద్ధసామగ్రినిగొంపోవునని రూజువెల్టు భావించిన ప్రకటన అమెరికాప్రజలకు చాలసంతోషముకలుగజేసెను. త్వరలోనిట్టిసంతోషవార్తలు మరికొన్ని రాగలవనిప్రజలుఆశించుచున్నారు. రెడ్ సీయుద్ధప్రాంతములోనిదికాదని ప్రెసిడెంటు రూజువెల్టు ప్రకటించినవిధముగాంచినచో కాంగ్రెసుయెదుట చర్చించునవసరము లేకుండత్వరత్వరగా నెప్పటికిబట్టున నప్పటికిరేమస్సైనికులను యుద్ధసామగ్రినిపంపుట అధ్యక్షుని ఉద్దేశ్యమైనట్లుస్పష్టము కాగలదు. గ్రీసులాండులో అమెరికా విమానాశ్రయములను స్థాపించుటకై చర్యగైకొనిరి కనుక యికమీదట అజోర్సులో విమానాశ్రయములనేర్పరుచుటకు చర్యగైకొనవచ్చునని యిదివరకే పత్రికలలో సూచింపబడినది.

ఇాకనుయొక్క వ డిస్ట్రాయర్లు బ్రిటను పరము చేయబడునాయని నేను[శుక్రవారం] అధ్యక్షుని డుగగా చేయబడవుఅనిచెప్పిరి.

— —

## చైనాలోయుద్ధము మరల విజృంభించుట

బర్మానుండి చైనాకుపోవుమార్గంమీద చైనాలోవున్న కూనింగుపట్టణముమీద జపాను విమానములతీవ్రదాడి ఏప్రిలు౧వతేది జరిగెను, చాలా ముఖ్యమైన సైనికస్థానములపై బాంబులు వేయబడెను.

చైనాలోనిసైనికులు చాటుమాటుగా కియాంగ్సూ రాష్ట్రింలోను తీవ్రంగా జపానువారిపై పోరాడుచున్నారు. కియాంగ్సూ రాష్ట్రింలో బాపు అనుచోట తీవ్రపోరాటంజరుగుచున్నది. ఈచైనా సైనికులను అణచివేయుటకు షాంగైనుండి జపానుసేనలు రప్పింపబడినవి.

### జపాను విదేశాంగ వ్యవహార సూత్రము

జపానులోని వివిధప్రాంతాల గవర్నరుల సభలో నేడు జపానుప్రధానమంత్రియగు కొనోయీ రాకుమారుడు ఇట్లుచెప్పెను:-

జర్మనీతోను ఇటలీతోను జపాను ఏకీభవించియున్నది. ఈమైత్రిని పురస్కరించుకొని జపాను తనవిదేశాంగ వ్యవహారమును సాగించుచుండును.

### జర్మనీలో జపాను నౌకాప్రతినిధులు

జర్మనీలో మకాముచేసి పర్యటనం చేయుచున్న జపానునౌకాశాఖా ప్రతినిధివర్గము జర్మనీలోని కీలుకాల్వవద్దకుచేరినది. ఆప్రతినిధివర్గంలో పెద్దనౌకాశాఖాధిపతులు, పెద్ద నౌకోద్యోగులు కలరు.

# అమెరికారేవులలో విదేశనావలు

## వశపరచుకొనుటకు రూజువెల్టు అధికారమునుకోరుట

అమెరికారేవులోని విదేశనావలనన్నిటిని వశపరచుకొనుఅధికారముతనకొసంగవలెనని రూజువెల్టుగారు కాంగ్రెసునుకోరిరి. నా... రమెసంగుటకులోబడిరే ఈఅధి... వని రూజువెల్టుగారుచెప్పిరి. అత్యవ... ర్పడినప్పుడుగాని, దేశరక్షణమునకు అ... ప్పుడుగాని అమెరికాప్రజలఆధీనమునమున్న అనుకొనుటకులేక పుచ్చుకొనుటకు మర్చెంటుమేరైనుఆక్టుతనకు అధికారమొసంగిరేయుండెను. తానుచెప్పునది ఒక్క డేనిషునావలకుమాత్రమేకేంద్రింపవలెనని తనఉద్దేశ్యముకాదు. సరుకులను రవాణాచేయునావలుతగ్గిపోవుచున్నవి. ఇట్లుగ్రహించకుండ ఉత్తరోత్తరదేశము సురక్షితమైయుండదని ప్రెసిడెంటురూజువెల్టుగారుచెప్పిరి.

### అమెరికాలో ఫ్రెంచిసేనలు

అమెరికాప్రభుత్వంవారు, తమరేవులలోవున్న, ఫ్రెంచినౌకలనుగూడా స్వాధీనంచేసుకొనుటకుద్దేశించినారు. ఆరేవులలోఇపుడు ౧౪ ఫ్రెంచినౌకలున్నవి.

రూజ్వెల్టుగారుకోరినప్రకారం విదేశీయనౌకలను స్వాధీనపరచుకొనుటకు అధికారమిచ్చుచట్టము అయినవెంటనే, ఆనౌకలు స్వాధీనపరచుకొనబడును.

### ఫోర్డుకంపెనీ సమ్మెపరిష్కారము

అమెరికాలో ఫోర్డుకంపెనీవారి రివర్ రూజ్ ఫాక్టరీసమ్మె పరిష్కారమైనట్లే చెప్పవచ్చును. ఆదివరకే కార్మికయూనియనువారు అంగీకరించియుండిన సూచనలకుకొన్నిమార్పులతో కంపెనీవారు ఆమోదించుటచే ఒడంబడికసాధ్యమయ్యెను. రివర్ రూజ్ ఫాక్టరీనితిరిగి తెరుచుటకు తాము సిద్ధముగానుండిరిగాని, పనివారినందరిని ఏకకాలమునరక్షించుట దుర్ఘటమనికంపెనీవారుచెప్పిరి.

### అమెరికా మందుల పరిశ్రమ నాజీలవశమున నుండుట

అమెరికాదేశములో వైద్యమునకుముఖ్యమైఇంజక్షనుమందులుజర్మనీవారివశమునమున్నట్లు అమెరికాప్రభుత్వన్యాయశాఖవారు తెలుపుచున్నారు మందులపరిశ్రమనాజీలవశమునసుండుటచేరమార్కెట్లను తమయిష్టమువచ్చినచొప్పున అమెరికావారినుండితీసుకొనుటకును ముందు స్వార్థమునకై దక్షిణఅమెరికా, బ్రిటిషుమార్కెట్లను సైతము ఉపయోగించుకొనుటకు, విదేశమారకము సంపాదించుటకు వీలుకలుగుచున్నది. న్యూజర్సీయందలి బ్లూమా ఫీల్డులో కరషిరింగ్ కార్పొరేషను వారి రికార్డులను, న్యూయార్కునందలి ఒకవిదేశ బ్యాంకును న్యాయశాఖవారు శనిఖీచేసి కోర్టులో దావాదాఖలుచేసిరి. నాజీలుఅమెరికా కంపెనీలతో న్యాయవిరుద్ధమగుకంట్రాక్టులు చేసికొనిరని న్యాయశాఖవారు చెప్పుచున్నారు, షిరింగువారి మందులలో యుద్ధసమయమునజాగ్రత్తగా నుండుటకు అవసరమైన ఇంజక్షనుమందుల నేకముకలవు

### నార్వేప్రజలకు రూజువెల్టుసందేశము

నార్వేపైజర్మనీవారు దుర్మార్గముగాదాడిచేసి ఒకసంవత్సరమైనది. ఏప్రిలు ౯ తేది రూజువెల్టుగారు నార్వేక్రౌను ప్రిన్సుఒలావ్ గారికి సందేశమంపుచు జర్మనులదండెత్తినప్పుడు నార్వేప్రజలనుచూపిన ధైర్యపరాక్రమములను, శత్రువుచే స్వాతంత్ర్యము హరింపబడిన తరువాత తిరిగిస్వాతంత్ర్యమును సంపాదించుటకిపుడు వారుచేయుచున్నపోరాటమును అమెరికాప్రజలెన్నటికిని మరువరనిచెప్పిరి. పూర్వమువలె యికముందుగూడ నార్వేప్రజలు తమయిష్టమువచ్చిన విధమునతమవ్యవహారములను చూచుకొనుహక్కుకలదని అమెరికాప్రజలెన్నటికి మరువరనిరి.

### అమెరికా దేశరక్షణావ్యయం

అమెరికా దేశరక్షణమునకై అవసరమగుసామానులు కొనుటకును, నావలనునున్నగువానినినిర్మించుటకును ౧,౮౦౦౦౦ కోట్లడాలరులను ప్రత్యేకించిరని రూజువెల్టుగారుప్రకటించిరి.

— —

### బ్రిటను జపానుల సంబంధములు

జపానులో బ్రిటిషురాయబారియగు సర్ రాబర్టు క్రెయిగు గారు ఏప్రిలు ౧౧వతేదిన విదేశాంగ సహాయమంత్రియగు ఓహాషీగారిని దర్శించి వారితో ఒకగంటసేపు మాట్లాడిరి, అపుడు బ్రిటను, జపానులసంబంధాలకు సంబంధించిన పలువిష...

## నాగపూరుకు సావర్కారుగారిరాక

పూలమాలవేయబోయి రాష్ట్రకార్యదర్శి మరణించుట.

నాగపూరు, ఏప్రిలు ౧౨

అఖిలభారత హిందూమహా సభాధ్యక్షులు శ్రీ సావర్కారు గారీ వేళ ఉదయం ఇచ్చటకు వచ్చినప్పుడు స్టేషనులో మధ్యరాష్ట్ర మహాసభ కార్యదర్శి శ్రీ ఆర్. బి. మో గారు విషాదప్రమాదమునకు గురియైమరణించుటచేత స్వాగతమొసగవచ్చిన జనులఉత్సాహం శోకంగామారెను. రైలుబండి స్టేషనులో ఆగకముందే అందరికన్నముందుగా సావర్కారు గారికి పూలమాల వేయవలెనను ఆతురతతో శ్రీ మోహోర్ గారు నడుస్తున్నబండి పట్టుకొనబోయి ప్రమాదవశమున రైలుక్రిందపడి మరణించిరి. శవమునుబయటలాగినపుడు పూలమాలకూడా చేతిలో నేయుండెను.

### హిందూమహాసభప్రత్యక్షచర్య గూర్చి ఆలోచన

హిందూమహాసభ ప్రత్యక్షచర్య విషయమై నిశ్చయించుటకు అఖిలమహాభారత హిందూమహాసభ సమావేశంజరుపవలెనని ఆ వేకమంది హిందూమహాసభ సభ్యులు తన్నుకోరియున్నారనియు అందుకై ఒకసభను తొందరగజరుపనుద్దేశించి అతివిత్తో హిందూమహాసభాధ్యక్షుడు శ్రీ వి. డి. సావర్కారు గారు నేడుఉదయం నాగపూరుకు వెళ్లినపుడు వారినిసంప్రదింపగా తెలిపిరి.

జెయిళ్లను నింపేకార్యక్రమము యేసమయమునందైనను ప్రారంభింపవచ్చుననియు, కాని ఆవిషయమై తొందరపడకుండా పరిస్థితిగమనించి నిర్ణయించవలసియున్నదనియు, యుద్ధ ఆవిషయమై

## పెద్దాపురం రైతుల పరిస్థితులు

కొడంగల్ తాలూఖా పెద్దాపురం గ్రామంలో పోలీసుపటేలుగ ఉన్నట్టి కొమారులు చాలఉత్తములు వారుప్రజలను తమబిడ్డలవలె భావించేవారలు. ఆగ్రామం మరియు లింగాల్ చేడు, యీరెండుగ్రామాలకు తరీకొల్వద్వారావున్నది. కాని కతువచాలాదినములనుండి తెగి వృథాగపడివున్నది. మరియు కొల్వపూడిపోయినది. వర్షాకాలంలో రైతులు యెన్నియో అష్టకష్టాలచేత నీళ్లుకట్టుకవచ్చి తరీసిస్తుచేసి సర్కారుకురఖం చెల్లించుచున్నారు, ఒకొక్కప్పుడు సమయముపైనచేనులకు నీరుసరిగాలభించక పైరులుచెడిపంటసరిగాపండక రైతులుచాలనష్టదశలోపడి సర్కారీరఖంచెల్లింపఅవకాశము లేనివారుగా గలుగుచున్నారు. అక్కడనూడిగూడ ఒకచేసుగలదు. ఇదేవ్యవస్థనుంచియెవ్వరుగూడ సిస్తుచేసేటందుకు యిష్టపడరు, వృథాగసర్కారుకు రఖంచెల్లింపవలసివచ్చినది, సర్కారువారు యింటిస్థితులనుగూర్చిఆలోచించవలెను, కతువమరియు కొల్వమరమ్మతుచేయించి బీదసాదరైతులను అష్టకష్టములనుంచి తొలగించగలరని ప్రార్థన.

ఇట్లు

ఎం. హన్మంతరెడ్డి

సంసిద్ధతను జూపుచున్నందుకు సంతోషమగుచున్నదనియు శ్రీ సావర్కారుగారు చెప్పిరి తాను వైస్రాయికి ప్రాసినవిషయాలను గూర్చితెలుపుచు వైస్రాయిగారు సానుభూతి జూపుచున్నట్లును హిందూమహాసభ కోర్కెలకు వైస్రాయినుండి ప్రత్యుత్తరంరాగానే నాగపూరు సభానంతరం ప్రకటింపబడుననికూడా వారుతెలిపిరి.

## అట్లాంటిక్ మహాయుద్ధము

అట్లాంటిక్ సముద్రంలో జర్మనునౌకలు రహస్యంగా సముద్రగర్భమున తిరుగుచు బ్రిటిషునావలకు చాలనష్టముకలిగించుచున్నవి. పోయినమార్చినెల ౩౧వ తేదితో అంతమగువారంలో ౭౮౩౭౮ టన్నులపరిమాణపు ఓడలు నీట ముంచబడినవి. ౧౯బ్రిటిషునౌకలు, ౫మిత్రదేశాలవి, ౭తటస్థులవి కలిసి మొత్తము౩౧ఓడలు ముంచబడినవి. ఎప్పుడోచేరుకొనియుండవలసిన బ్రిటిషునౌకలుకొన్ని ఇంకనూచేరుకొన్నవి ముంచబడినట్లే తలచవచ్చును. ఫిబ్రవరినెలలో వారమునకు ౬౫౦౦౦టన్నుల ఓడలు ముంచబడియుండగా, మార్చినెల లెక్క వారమునకు ౯౬౦౦౧ టన్నులఓడలగుచున్నది. అసలుయుద్ధారంభమునుండి ఇంతవరకు మొత్తము ౫౫౯౦౭౧టన్నుల బ్రిటిషునౌకలు సముద్రగర్భానికి పోయినవి.

బ్రిటిషునౌకలును జర్మనునౌకలను పూర్వముకంటె ఎక్కువగానే ముంచివేయుచున్నవి. ఎన్నిజర్మనునౌకలు ముంచివేయబడినవో లెక్క చెప్పుట సాధ్యముకాదు. కాని ౫౫మందిజర్మను "యూ"బోటునౌకల అధికారులును, నాలుగు వందలమందికి మించిన చిన్నఉద్యోగులు ఇపుడు బ్రిటిషువారివద్ద ఖైదీలుగానున్నారు.

మధ్యధరాసముద్ర మధ్యంలో ఒకబ్రిటిషుజలాంతర్గామి సరకులతోనిండిన కొన్నిశత్రునౌకలపై టార్పెడోలను వేసినట్లు ఏప్రిలు౯వతేదినాటి వార్తలో నున్నది

## జర్మనువారి అబద్ధప్రచారము

(Misleading Statements).

జర్మను, ఇటలీలో రేడియోలలో తమనోటికివచ్చినరీతిపద్ధతికి ఇంగ్లీషువారిపై అబద్ధప్రచారాలువేయుచున్నారు. బర్లినులో గతమాసము రేడియోలో ఇంగ్లీషువారుగ్రీకులను ఆకాశంపాపి అదేపోకడగావెళ్లిపోతారు సుమాఅనిసూచన చేసినారు. ఇట్లున్న కొన్నిదినాలలో ఇటలీరేడియోలో ఇట్లన్నారు 'గ్రీకులసైన్యమంతయు ఇంగ్లీషువారిచే నూతనపద్ధతిలో శిక్షణపొందబడినది ముందుగుండుఆరేయుఇంగ్లీషువారిదే. సేనానాయకత్వమంతయు ఇంగ్లీషువారిదే'ని జమనువారే బయటపడవేసినారుచూడండి.

ఇంకొక అబద్ధంముచ్చటను చూడండి వేవల్ అను ఇంగ్లీషుసేనానికి లిబియాలోఎందుకుయుద్ధముచేయవలసివచ్చిందంటే జర్మనులబలంమధ్యధరాసముద్రంలోయెక్కువై సాయమునకు కాలువగుండా ఓడలుపోకుండాఅయినందున అనిచెప్పినారు కాని వేవల్ సైన్యము మందుగుండుసామగ్రిఅంతయూడా సూయజుద్వారాప్రవేశించినవి. దానిని వ్యరును అడ్డగించేసామర్థ్యముకలవారు కానరాలేదు.

జర్మనులయుద్ధం మొదలైనప్పటినుండి ఇదిగో అయిపోయింది. అందరిని గెలుచుచున్నాము. ౧౯౪౦ లోనే అందరినిమట్టుపట్టుతాము అన్నారో తెలుకోనినారు. కానిఇప్పటికి యుద్ధము బాగాజరుగుతుంది, వారికోతలచేసిన్ని ఆధారంలేకపోయింది.

## ఈరాఖు ప్రభుత్వం

బ్రిటిషువారంగీకరింపలేదు.

ఈరాఖులో ఇటీవల క్రొత్తమంత్రివర్గం ఏర్పడెను, ఇదివరలోని మంత్రివర్గం బ్రిటిషువారికి అనుకూలవిధేయతలతో కూడియుండినట్టిది. ఇప్పటిమంత్రివర్గం సైనికబలమును ఆధారంచేసుకొని తటాలున రాజ్యాంగాన్ని వశపరుచుకొన్నట్టిది. ఈనూతనమంత్రివర్గం బ్రిటిషుప్రభుత్వానికి పూర్వమువలెనే అనుకూలంగా ఉండగలముఅని ప్రకటించెను. కాని దానిని బ్రిటిషువారునమ్మలేదు. వీరికి జర్మనీతో సానుభూతిఉన్నదని వారిఅనుమానం. ఎట్లయితేనేమి యీనూతన మంత్రివర్గాన్ని బ్రిటిషువారొప్పుకొనలేదు.

## అ. భా. పద్మశాలి సప్తమమహాసభ

కార్యవర్గసమావేశము

సోలాపురం, ౧-౪-౪౧

సోలాపురం అ-భా-పద్మశాలిసప్తమసభ కార్యవర్గసమావేశము ౧-౪-౪౧ న శ్రీ. పల్లగారిభవనంలో శ్రీమాన్ మాకీందావరు జనార్దనంగారి అధ్యక్షతనజరిగెను. కార్యవర్గసభ్యులు శ్రీ దావరు జనార్ధనం శ్రీ కడ్డిపల్లిపిరోబా, శ్రీ పల్లమన్మంతయ్య, శ్రీ బేతి నాగయ్య, శ్రీ బూర్గువిరోబా శ్రీ ఈరబత్తిని నారాయణరావు. శ్రీ చిలుకమల్లయ్య, శ్రీ గుంటుక నరసయ్యగార్లు హాజరుగానుండిరి. ఈదిగువతీర్మానములు గావింపబడినవి.

౧ సంఘోన్నతికై నిరంతరముకృషిజేసి కీర్తికాయులైన శ్రీ రాపేటి పరమేశ్వరశాస్త్రిగారి మరణమునకు చింతించుచు మృతాత్మునకు శాంతినొసగ యీశ్వరుని ప్రార్థించుచు వారికుటుంబమువారికీసభవారు సంపూర్ణసానుభూతిని తెలుపుకొనుచున్నారు.

౨ అ-భా-పద్మశాలి సప్తమమహాసభ ప్రధానకార్యదర్శులు, కార్యవర్గసభ్యులు, నిరంతర సంఘసేవాతత్పరులునగు శ్రీ గుంటుక నరసయ్యపంతులు గారి ధర్మపత్ని శ్రీ రుక్మిణమ్మగారియకాలమరణమున కీసభవారు చింతించుచు మృతాత్మకుశాంతినొసగ యీశ్వరుని ప్రార్థించుచు శ్రీపంతులు గారికుటుంబమునకు సంపూర్ణసానుభూతిని తెలియజేయుచున్నారు.

౩ కీర్తిశేషులైన శ్రీ రాపేటి పరమేశ్వరశాస్త్రిగారిస్థానే అ-భా. పద్మశాలిసప్తమసభ కార్యవర్గసభ్యునిగా సోలాపురవాస్తవ్యులు శ్రీ చిలుకమల్లయ్యగారు యేకగ్రీవముగ యెన్నుకొనబడినారు.

౪ అ. భా. పద్మశాలిసప్తమ సభాధ్యక్షులు దక్కన్ పద్మశాలిసంఘోద్ధారక బిరుదాంకితులగు శ్రీమాన్ మాకీందావరు జనార్ధనము గారు నిజాంగవర్నమెంటు ఆయుర్వేదడిపార్టుమెంటులో ఫీస్ సూపరింటెండెంటు (సదర్ హకీమ్) గానియమింపబడినందుకుఆపరిమితానందము నొందుచు ఆయుర్వేదశాఖనుస్థాపించి అభిమానమునుజూపుచున్న మ.ఘ.వ.శ్రీ నిజాంప్రభుత్వమువారికీసభవారు కృతజ్ఞతతెలుపుకొనుచున్నారు.

౫ సోలాపురవాస్తవ్యులు, పద్మసంఘయువక ప్రముఖులు, కాంగ్రెసుకార్యకర్తలునగు శ్రీమాన్ పులి మల్లయ్య, గారు సోలాపుర మున్సిపల్ ప్రెసిడెంటుగాయెన్నుకొనబడినందు కీసభవారు పరమానందమునొందుచున్నారు

౬ అ.భా. పద్మశాలిమహాసభకు తగిననిబంధనలు లేనందున "నియమావళి" తయారుజేసి మే నెలలోజరుగనున్న అ.భా. పద్మశాలిమహాసభ కంటెముందుగ కార్యవర్గసమావేశమునందు సమావేశపరుపగలందులకు "ఒక ఉపసమితి" గా యీసభవారు యేర్పరచుచున్నారు.

## ఇటాలీయ ప్రదేశాలపై బ్రిటిషు విమానాల దాడులు

వాటివల్ల ఇటాలీయులకునష్టము

అడిస్ అబాబాలో బ్రిటిషువారికి ౫ వేలమంది సైనికులు ఖైదీలుగ-చిక్కినారు. ఇంతేగాక బ్రిటిషు షుపరా సేనలవల్ల వచ్చిన ఖైదీలను, బ్రిటిషుఆఫ్రిక దక్షిణాఫ్రికా మోటారు డ్రైవరులుకలిసి పట్టుకొన్న ఖైదీలుకలిసి ౩౧౫౦ మంది ఇటాలీయ సేనలోనివారున్నారు. ఇరిట్రియాలో బ్రిటిషువారికి ౧౦౦౦౦ మంది ఇటాలీయసైనికులు ఖైదీలుగ చిక్కినారు. అబిసీనియాజాతివారగు ఇద్దరుసైనికాధికారులు ఇటాలీయుల సేనలోనున్నవారు డె బ్రూమార్క్ అస్మారాల పతనానంతరము బ్రిటిషు పక్షానికివచ్చినారు. వారలఅనుచరులు చాలమంది బ్రిటిషుపక్షానికిచేరుటకిది అనుకూలమగును ఫిబ్రవరి ౨౭వ తేదీవరకు లిబియాలో ౧౪౦౦౦౦ మంది, ఇరిట్రియా, అబిసీనియాలలో ౨౦౦౦౦ మంది, ఇటాలీయ సోమాలిలాండులో ౩౦౦౦ మంది, అబిసీనియాలో ౨౦౦౦౦ మంది, ఇటాలీయులు ఖైదీలుగ బ్రిటిషు, గ్రీకుసేనలవశమైనారు. ఇదేకాలంలో ఆఫ్రికాలోని అన్నిరంగాలలోకలిసి బ్రిటిషుపక్షాన ౨౪౦ మంది సైనికులు మరణించిరి, ఇతరవిధముల ౨౫౦ మందిపోయిరి.

బ్రిటిషువారివిమానాలు ఆఫ్రికాలో అన్నిరంగాలలోను ఇటాలీయసేనలపైనను, యుద్ధసామాగ్రులపైనను, విమానాశ్రయాలమీదను ఓడరేవులమీదను ప్రతిరోజు బాంబులనువేయుచునే యున్నవి. సిసిలీలో జర్మనుసైనికస్థావరముల పైనూడ ప్రతిరోజూ బాంబులనువేసినవి. ఈదాడులలోకొన్ని అందుబాటైనచోట్లలో దక్షిణాఫ్రికాప్రభుత్వమువారి విమానదళాలుకూడ పాల్గొనినవి. ఈదాడులనుండి ఒక్క బ్రిటిషువిమానమైనను నష్టముగాలేదు.

సిసిలీలో ఏప్రిలు ౫వతేదినాటి దాడులలో ౧౨ ఇటాలీయ విమానములక్రిందఉండినట్టివి మండిపోయినవి. మరికొన్ని పాడైనవి. ౬వతేదిన దాడిలో డెస్సీవద్ద కొంబాల్చాలో ౧౦ ఇటాలీయ విమానాలునాశనమైనవి. కొన్నిపాడైనవి. అ ం క ౯ డి వి మా నా శ్రయభవనాలు కూడపాడైనవి. సిసిలీపై దాడులలోఒకరోజు బ్రిటిషువిమానాలు ౧౪ జర్మను విమానాలను తమకెదురుపడ్డవాటినిక్రిందికికూల్చినవి. కాన్ని బ్రిటిషువారివిమానమొకటికూడ నష్టముకాలేదు. అబిసీనియాలో అసెబ్ ప్రాంతములో దక్షిణాఫ్రికావారి విమానాలుబాంబులువేసి శత్రుసేనలభవనాలను నాశముచేసినవి.

౧౦ నెలలయుద్ధంలో ఇటాలీయులు ౧౬౦౦ విమానాలను కోల్పోయినారని ఒకరనుచున్నారు ఇటలీవారికి యుద్ధప్రారంభములో ౩౫౦౦ విమానాలుండెనట, తర్వాతవరల ఇటాలీయులుకొత్త విమానాలను నిర్మించనేలేదట,

## రాత్రియువజనపాఠశాల

మహబూబునగరంతాలూకాలో రాంపురం అనేఒకగ్రామం కొయిలుకొండసమీపమునవున్నది. ఇక్కడినివాసస్థులలో శ్రీమాన్ ఎంహన్మంతరెడ్డి (మొ.కో) శ్రీమాన్ ఎం.భీంరెడ్డి (మొ,మాలి) శ్రీమాన్ జి.ఎల్లారెడ్డి (సాహుకారు) మరియు శ్రీమాన్ ఎం. లక్ష్మారెడ్డి (ఆయుర్వేద వైద్యు) గార్లుచాలాఉత్సాహులు, విద్యావంతులు. గ్రామోద్ధారకమహానుభావులు, పరోపకారులు, ప్రజలనుతమబిడ్డలవలెభావింతురు, శ్రీమాన్ యస్ సాంబమూర్తి సిద్ధాంతరత్నం మరియు శ్రీమాన్ ఎం భీంరెడ్డి (కాలేజివిద్యార్థి) గార్లు యిక్కడిప్రజల పరిస్థితులనుగూర్చిఆలోచించి రాత్రియువజనపాఠశాలస్థాపింపవలెనని యిష్టంగలవారలై గ్రామోద్ధారకులతో మనవిచేసిరి. అందులకైశ్రీవారలు కూడఅంగీకరించి శ్రీమాన్ జి. హేమారెడ్డిని ఉపాధ్యాయునిగాఏర్పరచి, రాత్రియువజనపాఠశాల స్థాపింపబడెను. ఉపాధ్యాయులవారుచాలాపరోపకారులు మరియు విద్యనేర్పుటలో మంచినేర్పరి పాఠశాలస్థాపింపబడి యిరువదియైదు దినములాయెను, పిల్లలు నిశ్చలబుద్ధితో విద్య అభ్యసించుచున్నారు. కానిపిల్లలకు విద్యఅభ్యసించుటకు పాఠశాలభవనము మంచిదొకటిఅవసరము-కాబట్టి గ్రామోద్ధారక మహానుభావులు బాలురకొరకై ఒకపాఠశాలభవనము చందాలమూలమునకట్టింపగలరనిప్రార్థన.

డి. హేమారెడ్డివిద్యార్థి

## నిజాంరాష్ట్ర ఆంధ్రమహిళా మహాసభ

అధ్యక్షురాలిఎన్నిక

హైదరాబాదు,దక్కన్ ఏప్రిలు ౧౩

ఎనిమిదవమహిళాసభ అధ్యక్షురాలిఎన్నిక హైదరాబాదుఆంధ్రయువతీమండలి, మహిళాసభ స్థాయిసంఘములపక్షమున ౯-౪-౪౧వాడు మండలికార్యాలయములో సమావేశంజరిగింది. హ్యారీసన్ సంఘమునుంచివచ్చినవాక్యనం చదివివినిపింపబడ్డది చిలుకూరులోజరిగే అష్టమాంధ్రమహాసభతోబాటుమహిళాసభమున్నూడా యథాప్రకారంగాజరుపుటకు నిశ్చయించినారు, అధ్యక్షురాలికొరకు ఈక్రిందివారిపేరులుసూచింపబడినవి

౧ శ్రీమతి యస్ రంగమ్మ ఓబలరెడ్డిగారు

౨ శ్రీమతి ఇల్లిందుల సరస్వతీదేవిగారు

౩ శ్రీమతిదిట్టకవి సుగుణావతీదేవిగారు

౪ శ్రీమతికలవకుంట సరస్వతీదేవిగారు

కారణాంతరాలుసూచించి మిగిలినముగ్గురు అంగీకరింపకపోవుటవల్ల శ్రీమతిరంగమ్మ ఓబలరెడ్డిగారు ఏకగ్రీవంగాఎన్నుకొనబడినారు.

శ్రీరంగమ్మ ఓబలరెడ్డిగారు శ్రీరాజాబహద్దరు వెంకటరామారెడ్డి ఓ.బి.యి గారి పుత్రికలు విద్యాధికురాలునగరమునందలి స్త్రీజనోద్యమనిర్వాహకురాండ్రలోముఖ్యులు హైదరాబాదునగరమునందలి ఏకైక ఆంధ్రమహిళా సంస్థయైన ఆంధ్రయువతీమండలికి ౩ సంవత్సరములనుంచి అధ్యక్షురాలు, హైదరాబాదు లేడీసు క్లబ్బుకు ప్రధానకార్యదర్శిని, హైదరాబాదు విమెన్స్ అసోసియేషను కార్యకారిణీసభ్యురాలుఅయివున్నారు, అట్టివారిఅధ్యక్షతక్రిందజరిగే ఈఎనిమిదవ మహిళాసభలో రాష్ట్రములోని స్త్రీలుఎక్కువగాపాల్గొని జయప్రదంచేయగలరని ఆశించుచున్నాము.

ఇట్లు

యు. సీతాకుమారి

మా. మాణిక్యమ్మ

స్థాయిసంఘకార్యదర్శులు

## సూయజ్ కాలువపై జర్మనీదృష్టి

"గ్రీసుపైదండయాత్రకు జర్మనీపూర్తిప్రయత్నముచేసినది కాని యుగోస్లావియాపై దండయాత్ర జరుపవలసివచ్చునని ఊహించలేదు. కాబట్టి యుగోస్లావియా సైనికులతనసేనపై కేంద్రీకృతము కాకుండ, జర్మనువిమానములు ఘోరమగుదాడులు సాగించుటకునిశ్చయించనవి. బాల్కను దేశములనుజయించి సూయజ్ కాలువను వశపరచుకొనవలెనని జర్మనీయుద్దేశ్యము" అనిస్వీడిషు పత్రిక వ్రాసినది.

మరియొక స్వీడిష్ పత్రిక ఇట్లు వ్రాసినది:-

"బ్రిటిషుసైనికులు గ్రీసుకుచేర్పబడుట వల్లను, టర్కీతనకుఅనుకూలముగ మెలగకపోవుటవల్లను జర్మనీగ్రీసు యుగోస్లావియాలపై వెంటనేదండెత్తుటకు నిశ్చయించెను. బ్రిటిషుసేనలు, యుగోస్లేవియాసేనలు గ్రీకుసేనలు, కలవకొనకుండ జర్మను విమానములు బాంబులువేసి ఆటంకపరచుటకు యత్నించును. యుగోస్లావియాసైన్యము అల్బేనియాలో ప్రవేశించి ఇటాలీయనులపై దాడిసలుపకుండగూడ జర్మనువిమానములు నివారించును.

సంవత్సరము చందా
రూపాయలు
ఆరుమాసాలకు
రూపాయలు
బ్రిటిషిండియాకు
సంవత్సరము చందా
రూపాయలు
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

**Volume 15** | **Hyderabad-Dn** | **Thursday 17 th April 1941** | **Number 95**

# యుగోస్లావియా విచ్ఛేదానికి జర్మనుల విధానము

## హంగరీవారు యుగోస్లావియాలో పరదేశ మాక్రమించిరి

రుమేనియా సేనలును యుగోస్లావియాపై దాడి

హంగరీచర్యకు రష్యావారి ఆక్షేపణ

యుగోస్లావియాపై జర్మనీవారొకవంకదిగిపోరాటము చేయుచుండ ఇపుడు హంగరీవారును రుమేనియావారునుకూడదిగినారు. హంగరీవారి సేనలు ఏప్రిలు 11వ తేదిన డాన్యూబునదికిని టిస్జానదికిని మధ్యను బారాన్యా త్రికోణభూమికి ఎదురుగనుండు యుగోస్లావ్ సరిహద్దును దాటినవి. ఇదివరలోజరిగిన యూరపుమహాసంగ్రామానికి పూర్వము హంగరీలో చేరియుండి ఆ సంగ్రామాంతమున యుగోస్లావియాలో చేర్చబడియున్న ప్రదేశమును-అనగా డ్రేవు, డాన్యూబునదులవరకు ఉండే త్రికోణభూభాగమును ఆక్రమించవలెనని ఆసేనల కాజ్ఞ యివ్వబడెను. ఆసేనలు ఆభూమిని ఏప్రిలు 12వ తేదినాటికే ఆక్రమించినవి.

రుమేనియాసేనలుకూడ యుగోస్లావియాపై యుద్ధంలోకి దూకినట్లు 12వ తేదినాటికే వార్త వచ్చెను. కాని తరువాత ఆసేనలు ఏస్థలమును ఆక్రమించుకొన్నది తెలియలేదు.

పోయిన జరిగో మహాసంగ్రామానికి పూర్వము బల్గేరియాకు చెందిన తర్వాత యుగోస్లావియాలో చేర్చబడినట్టి ప్రదేశమును తిరిగి రాబట్టుకొనవలెననుఉద్దేశ్యముతో బల్గేరియా సేనలుకూడ యుగోస్లావియాపైకి పంపబడుచున్నట్లు వార్తవచ్చినది.

ఉత్తముమీద యుగోస్లావియామీదికి జర్మనీవారే హంగరీ,రుమేనియా, బల్గేరియాలనుతోలించుచున్నట్లు కనపడుచున్నది రుమేనియావారికి బానాట్ అనుప్రదేశము నిచ్చెదమని జర్మనులు చెప్పినట్లు కనపడుచున్నది. అయితే ఈబానాట్లో రుమేనియనులకన్న హంగేరియులే ఎక్కువగా వాసము చేయుచున్నందుకల్ల ఈప్రదేశాన్ని రుమేనియాకిచ్చుచో హంగరీకి రుమేనియాపై అసూయ కలుగగలదు, యుగోస్లావియాలోని క్రోటులుఉండే ప్రదేశమునంతయు ఒకప్రత్యేక రాజ్యముగా చేయవలెనని జర్మనులు తలచుచున్నట్లున్నది. స్లావనీలను క్రోటులతో చేర్చవచ్చును, దీనికి డాల్మేషియాలిచ్చి ఏడ్రియాటిక సముద్రంలోకి వారికి కావలసినమార్గము లభించునట్లుచేయవచ్చును. సర్బియాపై జర్మనులే అధికారము వహించవచ్చును బహుశాజర్మనులు ఈవిధంగా చేయవచ్చునని రూటరు విలేఖరి అనుచున్నాడు.

అయితే స్వాబియన్యూస్ ఏజన్సీ యొక్క బర్లిను నగరపువిలేఖరి ఇంకొకరకంగా చెప్పుచున్నాడు. సర్బియాపై జర్మనులుఅధికారం వహించెదరట. క్రొయేషియాను స్వతంత్రరాజ్యంగామార్చి ఏడ్రియాటికుసముద్రంలోకి జర్మనీకి మార్గంలభించేటట్లు చేసెదరట. ఆల్బేనియాకు యుగోస్లావియాలోని మాసిడోనునుచేర్చి ఇటాలీయులను సంతృప్తిపరచెదరట. ఇపుడు యుగోస్లావియాలో కొంత, గ్రీసులోకొంత, బల్గేరియాలోకొంత ఉండేటటువంటి మాసిడోనియానంతటినికలిపి ఒకస్వతంత్రరాజ్యంగా ఏర్పాటుచేసి దానికి బల్గేరియాప్రభుత్వమునే రక్షకంగా ఏర్పాటుచేసెదరట- ఈప్రకారంగా యుగోస్లావియా విచ్ఛేదము పూర్తిచేయబడునట.

హంగరీకి రష్యావారి ఆక్షేపణ

ఈలోగా ఏప్రిలు 12వ తేదిన రష్యావిదేశాంగ ఉపమంత్రియగు వైషిన్స్కీగారు హంగరీయుగోస్లావియాతో శాశ్వతమైత్రి సంధి కుదుర్చుకొన్న తర్వాత నాలుగు నెలలకే ఈవిధంగా యుగోస్లావియాపైదాడి వెడలుట మంచిదికాదనియు, హంగరీనికూడ అటువంటికురదృష్టస్థితిలో మరెవ్వరైన యుద్ధానికిదిగుచో హంగరీకేను నివించగలదని యు-రష్యాప్రభుత్వపు ఆక్షేపణను రష్యాలోని హంగరీరాయబారికి తెల్పినారు.

రష్యాలోని హంగరీరాయబారి ఏప్రిలు 12వ తేదిన రష్యావిదేశాంగశాఖ ఉపమంత్రియగు వైషిన్స్కీగారినికలిసి హంగరీసేనలు యుగోస్లావియాపై దండెత్తుటకుగల కారణములను తెలిపి రష్యావారు హంగరీకొరకలన్యాయమును ఒప్పుకొనగలరని కోరిరట.

తుర్కీని సమాధానపెట్టె యత్నం

జర్మనులు తుర్కీ-సరిహద్దులోనుంచిన జర్మను సేనలను తొలగించివేసి తుర్కీకి సమాధానము కలిగించుటకు చూచుచున్నారు.

తుర్కీలో యుద్ధసమయానికి తగినరక్షణచర్యలను ప్రభుత్వమువారుఅవలంబించుచు ప్రజలకు పరిచయమగునట్లు చేయుచున్నారు.

తుర్కీలో బ్రిటిషు రాయబారి తుర్కీ-అధ్యక్షుని ఏప్రిలు 13వ తేదిరాత్రి దర్శించి 1½ గంటల సేపు సంభాషించిరి.

## ఆఫ్రికాలో శత్రు విజయములు

ఆఫ్రికాలో లిబియారంగంలో జర్మను ఇటాలీయ సేనలు ఏప్రిలు 13వ తేదినాటికి బార్డియాను, 12వతేదినాటికి కాపుజోదుర్గమును, ఈజిప్టుసరిహద్దులోని సోలమును ఆక్రమించినవి. టోబ్రుకు ప్రాంతంలో యుద్ధంతీవ్రంగాజరుగుచున్నది. ఈ స్థితినిగూర్చి ఆలోచించుటకై ఈజిప్టుప్రధాని ఏప్రిలు 13వ నాటిరాత్రి శాసనసభను సమావేశపరచెను. ఇపుడు ఆఫ్రికాలోకి బ్రిటిషుసేన లెక్కువగా తెప్పించబడుచున్నవి.

ఇరిట్రియాలో బ్రిటిషుసేనలు దక్షిణానికినడచిపోవుచున్నవి-అబిసీనియాలో బ్రిటిషుసేనలు ఇటాలియసోమాలిలాండునుండి దక్షిణఅబిసీనియాలోకి పోవుచున్నవి.

ఇటాలీయులు డెర్నాను, ఎల్‌మెఖుల్లీని వశపరచుకొన్నారు. మరియు వారు నిరనైకాలో కార్డిడినియర్గను చైలికాధికారిని పట్టుకొన్నారు-అబిసీనియాలో బ్రిటిషువారు ఇటాలీయ వైస్రాయియొక్క అందరకుకథ లనుపట్టుకొన్నారు-అబిసీనియాలో ఇటాలీయులు గందరగోళంగా పారిపోవుచున్నారు.

ఏప్రిలు 10,11,12,13వ తేదులలో ఆఫ్రికాలో బ్రిటిషువిమానాలును, దక్షిణాఫ్రికా ప్రభుత్వంవారివిమానాలును ఇటాలీయుల యొక్కయు, జర్మనులయొక్కయు విమానాశ్రయాలమీదికిదాడివెడలి చాలఅధికనష్టములను కల్గించినారు-విమానాశ్రయాలలోనుండు విమానాలును బ్రిటిషువారివిమానాల నెదుర్కొనుటకై పైకివచ్చిన శత్రువిమానాలును అనేకములు నాశము చేయబడినవి, ఒక్కొక్కరోజు పదులు, ఇరవైలు-ఈప్రకారంగా నాశనమైనవి.

## ప్రజావిద్యా మహాసభా తీర్మానాలు

పర్భనీలోజరిగిన చతుర్థ ప్రజావిద్యా మహాసభలో ఈక్రిందితీర్మానాలు అంగీకరింపబడెను.

1. ఈమహాసభవారు శ్రీ నిజాం ప్రభువుగారియెడ ప్రజలవిశ్వాసమును భక్తినిప్రకటించుచున్నారు. విద్యాభివృద్ధితొందరగా కావలెను ఈ రాష్ట్రము పూర్వమునుండి వర్తించుచు వచ్చిన ఆచారం ప్రకారము ఒకమతంవారికిచెందినదిమాత్రమేకాక ప్రజలందరికిని సంబంధించినదైయున్నది.

2. ప్రభుత్వవారు ఉస్మానియాపీఠాన్ని స్థాపించి దేశభాషలలో విద్యచెప్పించుమాత్రమును అంగీకరించినారు. దానిననుసరించి అంధ్రమహారాష్ట్రి కర్ణాటక భాషలలో ప్రజలలో భాషలలో మాధ్యమికోన్నతపాఠశాలల వరకు మాతృభాషలలో విద్యచెప్పించు ఏర్పాట్లుచేయవలెనని ప్రభుత్వమువారిని ఈమహాసభ ప్రార్థించుచున్నది.

3. ప్రజలు మాతృభాషలో నిర్బంధవిద్యను చెప్పించు ఏర్పాట్లుచేయవలెను.

4. నిజాంకాలేజీలో విద్యార్థుల ప్రవేశమునకు పరిమితియేర్పాటుచేసినారు దానినిరద్దుచేయవలెను,

5. ప్రభుత్వమువారు విద్యకై అపారముగా ద్రవ్యమును వ్యయముచేయుటనుచూడ వారుప్రజలలో విద్యావ్యాపకము బాగాచేయవలెనని కోరువారని స్పష్టపడుచున్నది. అందుచేత ప్రభుత్వమువారు ఖాస్గీబళ్లపైపెట్టిన ఆంక్షలను తొలగించవలెను. మరియు ఖాస్గీబళ్లకగుఖర్చులలోసగము ఖర్చును ప్రభుత్వమువారు భరింపవలెను,

6. వయోజన విద్యావ్యాప్తికై అనధికార సభ్యులకమిటీని ప్రభుత్వమువారు స్థాపించి వారిద్వారా విద్యావ్యాపకము చేయవలెను.

7. ఇతరముల్కీ-భాషలవలెనే హిందీనికూడా ముల్కీ-భాషగా నిర్ణయించి దానికి ప్రభుత్వమువారు ప్రోత్సాహమియ్యవలెను.

8. కళాశాలలలో మతవిద్యను తీసివేయవలెను

## వేలము నోటీసు.

సికింద్రాబాదు హిల్‌స్ట్రీటులో నం 8573 గల మడిగెలో స్థాపింపబడి సత్యనారాయణ రైస్‌మిల్లు అను పేరనడపబడిన బియ్యపు ఫ్యాక్టరీని, 20వ ఏప్రిల్ 1941 తారీకున వేలము వేయుదురు. అట్టి మిల్లు ఇప్రిక నరసింలు, గంగా రాఘవులు, కొత్తూరిసాయన్న గార్లకు చెందినవారిచేత ట్రస్టీలుగా నియమించబడిన 1. దేసువీరభద్రయ్య బెజవాడ, 2 దుందిగల్ల జగదీశ్వరయ్య సికింద్రాబాదు, 3. తేలుకుంట కాశయ్య సికిందాబాదు 4. రావుసాహెబు ఆలపాటి కుటుంబరావు బెజవాడ: గార్లపేర ట్రాన్సుఫర్ చేయబడినది. పైనుదహరించిన ట్రస్టీల పేర, ఇప్రక నరిసింలు, గంగారాఘవులు కొత్తూరిసాయన్న గారివల్ల ట్రస్టుడీడు ది॥ 19వ ఆగష్టు 1940 తారీకున రిజిష్టరు కాబడినది. ట్రస్టుడీడునకలు అచ్చుకాపి శ్రీ యస్. యస్.రాఘవన్, బి.ఏ. ఎల్.ఎల్.బి., ప్లీడరు గారి ఆఫీసులో (మార్కెట్టుస్ట్రీటు) చూచుకొనవచ్చును

వేలము సాయంత్రం 4 గంటలకు ప్రారంభించబడును.

వి. వేణుగోపాల్, బి ఏ బి ఎల్,
ఎస్. ఎస్. రాఘవన్, బి. ఏ ఎల్.ఎల్.బి.
ముట్నూరి నారాయణ, అక్షనర్.

# జపానురష్యాలకు ఒడంబడిక

## 5 సంవత్సరకాలపు తటస్థ్యానికి అంగీకారము.

జపాను విదేశాంగమంత్రియగు మత్సుఓకాగారు బెర్లినునుండి మాస్కోకు మాస్కోనుండి బెర్లినుకు తిరిగితిరిగి తుదకుపనిసాధించుకొనినారు. వారుమరల బెర్లినునుండి ఏప్రిలు 8 వతేదిపగలు మాస్కోకుజేరి 13వతేదివరకుండి రష్యాతో ఒక ఒడంబడికపై సంతకముచేసి ఆ సాయంకాలము వెళ్ళిపోయినారు. ఈఒడంబడిక 5ఏండ్లు అమలులోనుండును

ఈ ఒడంబడికప్రకారము యీదేశములు మైత్రికలిగి ఒకరిరాజ్యమునుఒకరు ఆక్రమించేయత్నం లేకుండా నుందురు. ఈరెండురాజ్యాలలో దేనిపైకైగాని మూడవదేశైన యుద్ధమునకైవచ్చుచో యుద్ధముపకుగురికాక మిగిలినరాజ్యము తటస్థంగానుండును, ఉభయరాజ్యాల ప్రభుత్వాలు ఈ ఒడంబడికను బలపరచినవెంటనే ఇదిఅమలుకువచ్చి 5ఏండ్లు అమలులోయుండును. తర్వాత రెండు రాజ్యాలలోఏదిగాని ఒడంబడిక చెల్లు కాలము పూర్తిఅగుటకు ఒకసంవత్సరముందుగా ఇకమీదట ఒడంబడిక అక్కరలేదని తెల్పకున్నచో మరి ఐదేండ్లు అది అమలులోనుండును,

ఒడంబడికపై సంతకములు చేయునప్పుడు మత్సుఓకాగారును మొలటోవుగారు చేసినప్రకటనలో మంగోలియారిపబ్లిక్ స్వతంత్ర రాజ్యమని జపానుఒప్పుకొన్నట్లును, మంచూకో స్వతంత్ర రాజ్యమని రష్యాఒప్పుకొన్నట్లును ప్రకటనచేయబడినది.

ఇపుడు మాస్కోనుండి జర్మను రాయబారి తమ జర్మను ప్రభుత్వముతో నాలోచించుటకై జర్మనీకి వెళ్ళిపోవుచున్నారు.

రష్యాజపానుల ఒడంబడికలపై సంతకములు చేయుట పూర్తియై మత్సుఓకాగారు జపానుకు వెళ్ళిపోవునపుడు రష్యానియంతయగు స్టాలిన్గారు స్టేషనువరకుపోయి సాగనంపివచ్చిరి.

ఈ రష్యాజపాను ఒడంబడిక సమయములో మంగోలియా, మంచూరియాలు స్వతంత్రరాజ్యములని ఉభయపక్షప్రతినిధులును ఒప్పుకొనినట్లు ప్రకటించుట చైనాకుఇష్టముకాకున్నది. చైనాప్రభుత్వ విదేశాంగ మంత్రియగు వాంగ్‌చంగ్ హాయిగారు ఏప్రిలు 14వతేదిన గావించిన ఒక ప్రకటనలో అరష్యాజపానులు ఒప్పుకొనుదానిని తాముఅంగీకరించుమని నారు, ఆశేయాన్ మంగోలియాలోని ఈశాన్యభాగమంతటి నాలుగురాజ్యాలు చైనాలోనివనియు ఇట్లు చైనాలోనిభూభాగాలను విచ్ఛేదముచేయు ఇతరుల ప్రకటనలను చైనాప్రభుత్వము అంగీకరించదనియు ఆప్రకటనలో తెల్పబడినది,

ప్రభుత్వపక్షపు ముఖ్యులతోకలిసి చైనాప్రభుత్వమువారు ఆలోచనచేసి, ఇపుడు జపానుతోఒడంబడిక చేసికొన్నందుకల్ల చైనాయెడరష్యావైఖరి ఇకముందెట్లు దుండునువిషయములో కలిగినసంశయములను తెల్పుచు వాటికిసమాధానమపేక్షించుచుసందేశమును రష్యాప్రభుత్వమునకు పంపినారు.

బ్రిటనులో "న్యూస్‌క్రానికిల్" అనుపత్రికయు, రూటరుసంస్థయొక్క రాయబారవిలేఖరియు ఈ ఒడంబడికను గూర్చి విమర్శచేయుచు రష్యాజపానులలో ఏదోఒకరాజ్యము మరొకరాజ్యముమీదికి యుద్ధానికిపోవుచో అప్పుడేమికావలెననునుచ్చట ఒడంబడికపత్రంతో లేకుండుట గమనించదగి యున్న దనుచున్నారు. చైనాకు రష్యాసహాయంచేయకుండా పోవునాఅనే విషయంలోకూడ ఒడంబడికలో ఏమాటయు లేకుండుట గమనించదగినదనుచున్నారు.

ఇపుడు రష్యాతటస్థంగానుండునట్లు ఒడంబడికకుదిరినది కాబట్టి-జపాను పసిఫిక్ సముద్రంలో క్రొత్తప్రదేశాలవిజయానికై దండయాత్రకు దయబయలుదేరవచ్చునని కొందరనుచున్నారు. అన్నిటికంటె విచిత్రమైనదేమి ఏమనగా రష్యాజర్మనీతో యుద్ధానికిదిగుచో జపానుతటస్థంగా ఉండవలెను కాబట్టి, రష్యాజర్మనీతో కుదుర్చుకొన్న ఒడంబడిక జర్మనీ,ఇటలీజపానుల ఒడంబడికపై పెద్దదెబ్బకొట్టినట్లనవచ్చునని జర్మనీ, ఇటలీ,జపానుల ఒడంబడిక ప్రకారము ఇప్పుడు యూరపుయుద్ధంలో చేరుచున్నవారికి క్రొత్తగా ఎవరుగాని దాడిచేసిన ఈ మూడురాజ్యాలు పరస్పరసహాయము చేసికొనవలెను రష్యాజపానుల ఒడంబడికప్రకారము జపాను తటస్థంగా ఉండవలసినచో పైఒడంబడిక భగ్నమైనట్లేగదా కాని ఇంతట్లో రష్యాజర్మనీతో కయ్యమునకుదిగుననుకొనరాదని బ్రిటిషు పత్రికలవార అనుచున్నారు.

స్లోవాకు రాయబారిప్రయాణము-

మాస్కోనుండి జర్మనురాయబారి జర్మనీకి పోయినట్లేస్లోవాకు రాయబారికూడ మార్చి 31వ తేదిన స్లోవాకియాకు తమప్రభుత్వంతో ఆలోచనచేయుటకై వెళ్ళిపోయిరి.

## వేలము నోటీసు.

ఈదిగువనుదహరించిన యిల్లు 21 వ ఏప్రిలు 1941 వ తారీకున పబ్లికు ఆక్షనులో వేలము వేయబడును. ఈయిల్లు ఇప్రిక నరిసింలు, గంగా రాఘవులుగారి వరంకుచెంది, వారివల్ల ట్రస్టీలుగా నియమింపబడిన 1. దేసు వీరభద్రయ్య, బెజవాడ. 2. దుందిగళ్ల జగదీశ్వరయ్య, సికింద్రాబాదు 3. తెలుకుంటకాశయ్య సికింద్రాబాదు, 4. రావుసాహెబు ఆలపాటి కుటుంబరావు బెజవాడ గార్లపేర రిజిష్టరు ట్రాన్సుఫర్ డీడు ద్వారా 19వ ఆగష్టు 1940 తారీకున ట్రాన్సుఫర్ డీడు నకలు (అచ్చుకాపీలు) శ్రీ ఎస్.ఎస్. రాఘవన్ బి.ఏ.,ఎల్.ఎల్.బి., (మార్కెట్టుస్ట్రీటు) గారి ఆఫీసులో చూచుకొనవచ్చును.

ఇల్లునెం. 4238 గలది,
స్టేషనురోడ్డు, సికింద్రాబాదు.
వి. వేణుగోపాల్, బి ఏ బి ఎల్
ఎస్. ఎస్. రాఘవన్, బి ఏ ఎల్ ఎల్.బి.,
ట్రస్టీల ప్లీడర్లు.
ముట్నూరి నారాయణ, అక్షనర్.

## కావలెను.

ఇంగ్లీషులో మెట్రికువరకుచదువుకున్న వాడును. తెనుగు బాగా తెలిసిన వాడును ఇంగ్లీషు టైపు తెలిసిన వాడును అయిన క్లార్కు కావలెను. యువకులుగాని పెన్షను పొందినవారుగాని నియోగింపబడుదురు. అభిలాషులు ఏప్రిల్ నెలాఖరులోగా మా కార్యాలయమునకు వ్రాసుకొన వలెను.

మేనేజరు
గోలకొండ పత్రిక

Printed and Published by, G Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor- S. Prathapa Reddy B A B.L